విమలానంద భారతీ గ్రంథమాల - త్రయోదశ పుష్పము

# ఉపదేశామృత తరంగిణి

( ద్వితీయ భాగము )


సంగ్రథనము

శ్రీ పోలూరి హనుమజ్జానకీరామ శర్మ, B, A., (Hons)

ప్రాచ్యభాషా శాఖాధ్యక్షుడు

వేంకటగిరి రాజా కళాశాల, నెల్లూరు.





ప్రచురణ - దుర్మతి - ఆశ్వయుజము

ప్రథమ ముద్రణము - 250 ప్రతులు

విమలానంద భారతి నుండి ఉద్ధృతము

ముద్రణ - శ్రీ తిరుమల ఆర్ట్ ప్రింటర్స్-విజయవాడ

వి జ య వా డ

81 - అక్టోబరు

వెల : 4 రు

# పీఠిక

ప్రతి జీవి మోక్షమును ఆకాంక్షించు చున్నాడు. అది నిత్యమైనది కావలెను. దానిని తెలుపు మార్గమును నిత్యమైనది కావలయును. అట్టి ప్రథ మన శ్రుతి స్మృతులకు తప్ప వేఱు గ్రంథములకు లేదు. అందువలన ప్రతి జీవికి అత్యంత ముఖ్యములైనవి మన ప్రస్థానత్రయము. ఉపనిషత్తులు. బ్రహ్మసూత్రములు, భగవత. అవి దురవగాహము లగుట వానికి పెక్కుమంది ఆచార్యులు భాష్యములు వ్రాసి ఉన్నారు. వానికి వ్యాఖ్యానములు వెలసినవి. అవన్నియు సంస్కృత భాషయందు కలవు. అసలు విషయము గురుముఖముగనే తెలిసికొని సాక్షాత్కరింపఁ చేసికొని అనుభవమునకుఁ తెచ్చుకొన్ననే తరించుట. దాని కీగ్రంథము మిక్కిలి తోడ్పడును.

ఇది పూర్వాశ్రమములో బందరు వాస్తవ్యులు కానుకొల్లు త్రివిక్రమ రామారావు పంతులు గారు తరువాత సన్యసించి శ్రీ విమలానంద భారతీస్వామి వారను నామము ధరించి పిదప కుర్తాళం శ్రీ సిద్ధేశ్వరీ పీఠమునకు ప్రథమ పీఠాధిపతులైన వారు వరుసగా బందరులో థియొసాఫికల్ లాడ్జిలో భక్తుల కోరిక మీఁద ఇచ్చిన ఉపన్యాసముల సారము. అప్పుడు సంక్షిప్త లేఖనముగాని టేప్‌రికార్డింగుగాని లేదు. ప్రస్తుతం శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు పరమహంస పరివ్రాజక వర్యులు జగద్గురువులు శ్రీశ్రీశ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాములు, పూర్వాశ్రమములో శ్రీ చిట్టూరి రామకృష్ణారావు పంతులుగారు శ్రీవారి ప్రధాన శిష్యులు వానికి వెళ్లి భక్తితో ఆ ఉపన్యాసముల సారమును వ్రాసినారు. ఇదెంత దుర్ఘటకార్యమో చెప్పఁ బనిలేదు. శరపరంపరగా సాగు ఉపన్యాసమును పూర్తిగా చెప్పినది చెప్పినట్లుగా వ్రాయుట మానవ సాధ్యము కాదు. మధ్య కొన్ని వదిలి వేయవలసి వచ్చును. వానిని తరువాత వారు టైపు యించి శ్రీ గురుస్వాములకు చూపించుట కూడ జరిగినది.

దీనిని విమలానంద భారతి మాసపత్రికలో "ఉపదేశామృత బిందువులు" అను నామము క్రింద ముద్రించుట ప్రారంభించినప్పుడు కొందఱు మిత్రులిది సమగ్రముగా చదివి విషయమునకు పరస్పరసంబంధము సంధించి ఏక వాక్యత వచ్చునట్లుగా ముద్రించిన బాగుండునను నభిప్రాయము వెలిపుచ్చిరి. అట్లు వీనిని కూర్చుట కూడ సామాన్య విషయము కాదు. దీనికి పూనుకొని చి॥ పోలూరి హనుమజ్జానకీరామ శర్మ చక్కఁగా వీనిని కూర్చినాడు. అందువలన పాఠకలోకము వీరు ముప్వురికిని మిగుల ఋణపడి యున్నదనవచ్చును.

వీని ప్రాశస్త్యము గుణగ్రహణ పారీణులకే తెలియును. శ్రీ శంకరాచార్యుల వారు లోకోత్తర పురుషులైనను, వారి ప్రతిభ మనకు తెలియునది మన గురువుల వలననే. అందువలన ఆ గ్రంథముల కన్న ముఖ్యమైనది మన గురువుల ఉపదేశము. అట్లే ఈ గ్రంథము మనకు శ్రుతి స్మృతులకన్న ముఖ్యమైనది. ప్రస్తుతము అజ్ఞానము వలన, ప్రజల రంజించుటయే ముఖ్యోద్దేశముగా, మన శ్రుతి స్మృతులకు పలువురు స్వాములు, పండితులు విపరీతార్థములు చెప్పుచు అధోగతికీడ్చుచున్న సమయములో వానికి సరియైన అర్థమును జెప్పు ఈ గ్రంథము అమూల్యమైనదని వేరే చెప్ప బనిలేదు.

మార్లె (MORLEY) మహాశయుడు బాగుపడ దలచుకొన్న ప్రతి వ్యక్తియు తన దగ్గర తాను ప్రతి దినమును చదువ వలసిన యొక పవిత్ర మత గ్రంథమును, తన కన్నులలో చదివి యుత్తేజము పొందవలసిన యొక మహాపురుషుని జీవిత చరిత్రయును ఉంచుకొనవలె నన్నాడు. ప్రస్థానత్రయసారమై, వాని అనుభవపూర్వక వివరణమైన యీ అమూల్యమైన గ్రంథము, జిజ్ఞాసువులకు జ్ఞాన సంపాదనకును, జ్ఞానులకు మననమునకును ఉపయోగపడుచు, ఇది ప్రతి దినమును పారాయణ చేయ వలసిన గ్రంథముగా నుపకరింప గలదు. బుద్ధిమంతు లిది అట్లుపయోగించి తరించెదరు గాక !

దీని ప్రథమ భాగము ఇదివరకే మా విద్యార్థి చి॥ గుండా శంకరలింగము ధన సహాయముతో ముద్రింపబడినది. ఈ రెండవ భాగము ముద్రించుటకు తోడ్పడిన వాడు మా బంధువులు, చి॥ జానకీరామ శర్మ అల్లుడు చి॥ చతుర్వేదుల వేంకటకృష్ణ నరసింహ మూర్తి, ఇతని పూర్వులు శిష్టాచార సంపదకలిగి అనేక ప్రజోపయోగ కార్యములు చేసినవారు. ఇతడును పట్టభద్రుడై, న్యాయ శాస్త్రమునందుత్తీర్ణుడై వారి యడుగుజాడలలోనే నడచుకొను చున్నాడు. పరమేశ్వరుడితనికి, ఇతని కుటుంబమునకు చిరాయురారోగ్యైశ్వర్యము, సుఖ శాంతులు ప్రసాదించును గాక! వీరి పూర్వులకు శాశ్వత బ్రహ్మలోకవాసము మోక్షము ప్రసాదించును గాక !

---- ---o--------

## చతుర్వేదులవారి కుటుంబము

రాఘవయ్యగారు, శ్రీరాములుగారు, రామచంద్రయ్యగారు సోదరులు. రాఘవయ్యగారు స్వరాజ్య సమరములో పాల్గొని జైలునకు వెళ్లినారు. లోకమాన్య బాలగంగాధర తిలకు గారియందు మిగుల భక్తి కలవారు. జైలులో కూడ స్వయం పాకము చేసకొన్న నైష్ఠికులు. వీరు నెల్లూరు దగ్గర నున్న పల్లెపాడులో విప్ర విద్యాలయమును స్థాపించి వేదములను సంస్కృతమును విద్యార్థులకు బోధించుటకు కృషి చేసినారు. ఈ విద్యాలయమును గాంధీ గారు కూడ సందర్శించినారు. రాఘవయ్యగారు బ్రాహ్మణ బాలుర కొఱకు బ్రాహ్మణుల ధనముతోనే వసతి గృహములను (Hostels) కొన్నాళ్ళు నడిపినారు.

శ్రీరాములుగారి కుమారుడు కీ. శే. సత్య గోపాల కృష్ణమూర్తిగారు మూల పేటలోని వేద సంస్కృత కళాశాలా పాలకవ మున కార్యదర్శిగా ఉండి ఎంతో సేవ చేసినారు. వీరికి అయిదుగురు కుమారులు. రిలో చి॥ వేంకట కృష్ణ నరసింహ మూర్తి నాల్గవవాఁడు. ఇతనిని శ్రీరామచంద్రయ్యగారు దత్తు చేసికొన్నారు. రామచంద్రయ్యగారు కూడ కాంగ్రెసులో పనిచేసినారు. అన్యాయమును ఎదుర్కొనుటకు ఎంత పనియైన చేసేవారు. పార్కు వేయవలసిన స్థలమును కొందఱు ఆక్రమించుటకు పూనుకొనగా వారి నెదిరించి అచ్చట స్వతంత్రపార్కు ఏర్పడునట్లు చేసినారు. ఆంధ్రసభలో గీతా మందిరమును వేద సంస్కృత కళాశాలలో కొన్ని భవనములను కట్టించి ధర్మ కార్యములకై ముప్పదివేల రూప్యముల ధర్మ నిధి (Trust) ఏర్పఱచినారు.

చి॥ వేంకట కృ నరసింహమూర్తి B. Com. B. L. అయి న్యాయవాది వృత్తిలో ఉండి దత్తు ండ్రిగారు నిర్దేశించిన ధర్మకార్యములను శ్రద్ధతో భక్తితో కొనసాగించు చున్నాడు.

విజయవాడ

కారుమంచి కొండలరావు

విషయసూచిక

## తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 10 | ప్రఖా తి | ప్రజాపతి |
| 4 | 8 | శకా ము... శవా | శవాకారము.... శివా |
| 5 | 23 | పరిపూరించు | పరిహరించు |
| | 26 | ఉండునా?" ఉన్నదే | ఉందునా ?" అన్నదే |
| 6 | 5 | వున్నాము? | ఉన్నాను! శరీరములో ఉన్నాను. |
| 7 | 0 | నామర్వ్యాము—స్వర్వ్యా | నామరూవము.... స్వరూప |
| 16 | 7 | ఏ భావ | ఏయేభావ |
| | 23 | శాపి—తస్తే | వాపి ...త్యస్తే |
| 17 | 8 | కరం | కర్మ |
| 19 | [illegible] | చివర పంక్తి క్రింద "ఎందులకు?" కలుపవలెను. | |
| 22 | [illegible] | త్వాతస్తేష | తాప త ప్తేష |
| 24 | 16 | కాదు. | కాదు. అతని తల్లిదం డ్రులపాపమునుకాదు, |
| | 1[illegible] | తోనే | తోనే చదువ వ ను. మన గ్రంథ |
| | [illegible] | | ములనైనను ఆ దృ తో |
| 26 | 10 | భయమైన మునులలో | భయ మైథునములం |
| 27 | 16 | ర | సిద్ధ |
| 30 | 17 | ర్తుల | కర్తుం |
| | 21 | తెలియునది | తెలియనిది |
| | 24 | సుఖము | సుఖముకాని |
| 36 | 18 | Operate | Operational |
| 38 | 35 | విశ్వాసును తరంతములు | విశ్వమను తరంగములు |
| 39 | 17 | నేను నేనెఱుగుదును | నన్ను నేనెఱుగు: ను. |
| 60 | చివర ఈ శ్లోకము చేర్చవలెను. | | |

శ్లో॥ ఇద శ్యేషు నశ్యత్సు న నశ్యతి ధ్రువం, ద్రష్టాయత స్సర్వవికారవేత్తా
ష్టః ప్రణాళో యదికేన దృశ్యతే, సో౽పి స్వయం ౯తిహిభేదదూరగః

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 51 | 10 | ద్రష్టమే | ద్రష్టయే |
| | 13 | లోనో | లోనో ఏ దేవునో |
| 53 | 10 | కరదు | తీరదు |
| 54 | [illegible] | గోవులము | వలన గోవులను |
| | | జ్ఞానము | అను జ్ఞానము |
| 55 | | దుర్దయివ ...సం ్పము | దుర్దయివ—సంకల్పము |

సులభముగా తెలియునవి ఈయలేదు.

# ఉపదేశామృత తరంగిణి

## ద్వితీయ భాగము V

## మృత్యువు

### 1. మృత్యు విచారణ

పాప పుణ్యములకు ఫలము ఇక్కడఁగాని, చచ్చిన తరువాత పరలోకములోఁగాని జన్మాంతరమునఁగాని తప్పక అనుభవింపవలసినదే అని గట్టిగా తెలిసిననేత పాపభీతి, ధర్మానురక్తి ఏర్పడవు. "చచ్చిన తరువాత ఏమున్నది, అంతయు శూన్యమే" అన్న తప్పు డభిప్రాయము మన కందఱకు నున్నది. అసలు మనము మృత్యువే లేదన్నట్లుగా వ్యవహరించుచుందుము. దాని పేరు చెప్పము. దానిని గూర్చి ఆలోచింపము. ఆ మాట అనుకొన్నచో అంతయు భయమే; మరొక సంగతి తోఁచనే తోఁచదు. మనకు భయము కలుగుచున్నదన్నచో భయకారణ మున్నదన్నమాట. భయకారణ మున్నదన్నచో వివేకవంతులు దానినిగూర్చి తప్పక విచారింపవలసినదే కదా! మృత్యువును చూచుట అనగా నాయొక్క అంతమును చూచుటయే. మరి నేనే లేకపోతే నాయొక్క అంతమును చూచుట యెట్లు? కాఁబట్టి నా మృత్యువులో నేను పోనన్నమాట; నేను మిగులుదు నన్నమాట. రంగస్థలమున నటించుచున్న నటునకు తన పాత్ర ముగియుచున్న దన్నచో, అది తన యంతము కాదని గట్టిగా తెలియును. అలాగే ఈ జన్మ ముగియుచున్న దన్నచో, మృత్యువు శరీరమునకే కాని నాకు కాదన్నమాట. ఈ శరీరమే నేనైనచో ఇక్కడ ఏమిచేసినను దాని ఫలము శరీరము పోయిన తరువాత అనుభవించుట యెట్లు? కావుననే శరీరమే నేననుకొనువాఁడు ఆ శరీరమును పోషించుటకు రక్షించుటకు నానాయాతనలు పడుచున్నాఁడు. కాని రసాయనాదులచేత మృత్యువును కొంతకాలము తప్పించుకొనవచ్చును గాని శాశ్వతముగా శరీరమును నిలుపుకొనలేము.

అయినను కారణము లేనిది చావురాదు గనుక: అట్టి కారణములను సాధ్యమైనంతవరకు తొలగించుకొనుచు మృత్యువు రాకుండ మన యునికిని దీర్ఘము చేయుటకు ప్రయత్నించుచున్నాము. మృత్యువు సహజమని యెరుంగము. మనకు ఎప్పుడును ఉండవలెనని, ఎప్పుడును ఉందుమని యున్నది. నే నెవడను, చావేమిటి. అను ప్రశ్నలు వేసికొనము. నేను చచ్చిపోవుదునని యుండినంగదా, చచ్చిన తరువాత ఏమగుదునని ప్రశ్న పుట్టును. యోగీశ్వరేశ్వరుండైన శ్రీకృష్ణుడు కూడ, ఎంత యోగశక్తియున్నను. ఆ శరీరమును శాశ్వతముగా నుండలేదని జ్ఞప్తియుంచుకొనుడు, ఆయన "ఈ బ్రతుకును నిత్యము చేయుట కల్ల. ఎప్పటికయినను ఈ శరీరము పోవలసినదే" అని చెప్పినాడు

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ! భగవద్గీత.
అధ్యా 2 శ్లో 27

"నేను చావక తప్పదు, చచ్చిన తరువాత మరల జన్మించుట కూడ తప్పదు, ఇప్పుడు చేయుచున్న పాప పుణ్యములకు నేను కర్తను" అని తెలిసినచో ఇప్పుడీ జీవితములో ప్రారబ్ధము ననుభవించి చచ్చిపోవుచున్నానుగాని, ఏమి క్రొత్త పుణ్యమును సంపాదించుకొనుచున్నానని ప్రశ్న యుదయించును. ఇట్టి భావన రానంతవరకు మనము కర్తలమని తెలుసుకోలేదన్న మాట. ఇట్లు తెలిసికొనలేక పోవుట, మన పూర్వపు మహా పాప ఫలము. జంతువులవలెనే దేహావసరములను తీర్చుకొనుటలోనే మన సంకుచితమైన యహంకారము సమాప్తమగుచున్నది. తయారుచేసిన గ్లాసులు, అమ్మిన తరువాత పగిలిపోవుచుండంగా, జనులకు అవి తిరిగి తిరిగి కావలసియున్నచో Increase of Demand గ్లాసుల కర్మాగారమునకు Glass factory లాభ మెక్కువగును. మన యహంకారముకూడ ఇట్టిదే. నేను కర్తను గనుక నా సంకల్పములనుబట్టి ఎన్ని జన్మలయిన

రావచ్చును కాని అన్ని జన్మలు పోవలసినవే. కోరికలు తీరకున్నచో నేను తిరిగి జన్మలను సంపాదించుచునే యుండవలె. ఈ జన్మలతో మృత్యువులతో ఎప్పటికోగాని విసుగు కలుగదు. అప్పుడు కర్తృత్వమను భూతము ఎప్పుడు వదలిపోవునా అను విచారణ కలుగును. అప్పుడీ కర్తృత్వమును పుణ్యమార్గమున ఉపయోగించి అభ్యుదయ మార్గమునకైన దగవలె, లేదా యీ కర్తృత్వమనే ఆఖరు చేకొని నాస్వరూపముతో హాయిగా నుండుటకు నిశ్శ్రేయస మార్గమునయిన అవలంబింపవలె ఎట్లయినను ఇప్పుడు మనకున్నవానితో ఎప్పుడును సంతోషింపకూడదు. ఉత్తమగతులకొరకై ఎప్పుడును ప్రయత్నము చేయుచుండవలసినదే. హనుమంతుడు వచ్చు కల్పములో ప్రఖ్యాతి యగును. అట్టి కర్తృత్వ సంపద మనకును కలదు

మనము ఉన్నదానిని వదలుకొనలేము; పైదానికి ప్రయత్నింప లేము; మిథ్యావిరాగముతో మాకంతంత కోరికలు లేని చెప్పు చుందుము-కాని మృత్యు వన్నచో భయపడుచుందుము. "దినదినము చచ్చుచున్న వాని చూచుచుండియు మనము చావము అనిమనుష్యు లను కొనుచుండుటయే ప్రపంచములో అతి విచిత్రమైన విషయ"మ ధర్మరాజు చెప్పినాడు. ముసలితనముచేత జీర్ణించుచున్నను, మృత్యువును గూర్చిన యాలోచనయే లేకుండ, ఆశలతో పందిళ్ళు వేయుచునే యుందుము.

శ్లో॥ జీర్యన్తి జీర్యతః కేశాః దన్తా జీర్యన్తి జీర్యతః।
జీవనాశా ధనాశా చ జీర్యతోఽపి న జీర్యతే॥

(ముసలివానికి వెంట్రుకలు ఊడిపోవును; దంతములు రాలి పోవును; కాని బ్రతుకవలయునను కోరిక, ధనాశ మాత్రము జీర్ణింపవు.) చచ్చుటకు పుట్టినవాడే చచ్చినవానిని బట్టుకొని, తాను చావకుండ నుండువానివలె ఏడ్చుచుండును. ఒకడు చనిపోయిన తన తండ్రిని పూడ్చిపెట్టిన తరువాత నీ వెంట వత్తునని క్రీస్తుతో చెప్పగా

అప్పుడాయన "చచ్చినవారు చచ్చిన వారిని పూడ్చిపెట్టుకొందురుగాక!అని చెప్పినాడు. అనగా ఈ పూడ్చిపెట్టుచున్నవాడు కూడ, ఒకప్పటికి చచ్చినవాడే గనుక చచ్చిని వానితో సమానుఁడే అన్నమాట. మనము విశృంఖలముగా వర్తించుచున్నామన్నచో, మృత్యువును విస్మరింపఁజేయుచున్న మోహమ్మును సారాయమును త్రావుచున్నా మన్నమాట. (మోహ మదిరాం పీత్వా). ఏనాఁడుచచ్చిపోవుచున్నా మని తెలియునో అనాఁడు శవమై పోవుదుము. అందువలననే శంక రులవారు "శకారమును వదలి శివాకారమును భజింపవయ్యా!" (శవాకారం పరిత్యజ్య శివాకారం భజస భోః) అని మనలను మేల్కొ లుపుచున్నారు. మృత్యుభీతి యున్నం వరకు మనము శవాకారులమే మృత్యువుతో నాశ మొందున దేది? శరీరమే. శరీర మనఁగా శ్రుతి యేమి చెప్పినదో చూడుఁడు

హసిత రుదితం గీతం వీణాషణ విల తం।
మృతం జీవంచ యత్కించిత్ అజ్ఞోఽసి స్నేహవిద్ధి తత్॥

హసితాదులుకూడ దేహము లోని యవయవములే యఁట. ఇది శ్రుతి చెప్పక మన బుద్ధికి ఎన్నటికిని గోచరము కాదుగదా! ఇది యంతయు మృత్యువుతో నశించునదే. ఈ నశించు దానిని గూర్చి విచారించుచునే దీని కాధారమైన నీ స్వరూపమునుగూర్చి తెలుసుకో వలె. బల్లమీాద ఒక పండు ఉన్నదనుకొనుము. ఆ పండును తీసి వేసినచో, ఇంతకు పూర్వము అక్కడ ఆ పండును చూచిన వానికి అక్కడ పండు లేకపోవుట కన్పించును.

---

i) "Jesus said unto him, Let the dead buy th r dead——" (St. Luke Dhap. 9 No, )

అప్పుడు ఆ పంచనకు ఆధారమైన బల్లి స్పష్టముగా గోచరించును. అలాగే శరీర నాశమును గూర్చి విచారించునప్పుడు దాని కాధారమైన నీ స్వరూపమును గుర్తింపవచ్చును. చనిపోవునప్పుడు నీ వ్యవహారమంతయు పోవుచున్నది. చావు అనగా వ్యవహారము యొక్క అభావమును చూచుటయే. అసలు ముందు వ్యవహారమును చూచుట ఎట్లో తెలిసినగాని దాని యభావమును చూచుట తెలియదు. అనగా మనము జీవించి యున్నప్పుడే మన వ్యవహారమును చూచుట అలవరచుకొనవలెను. మన మందరము ఎప్పుడును ఏదో వ్యవహారము చేయుచునే యుందుము కాని, ఆ వ్యవహారమును చూడము. కావుననే మనము చేయుచున్న తప్పులు మనకు తెలియవు. తన తప్పును తాను తెలిసికొనగలిగినచో వాడు దేవుడంత వాడగును. నీ తప్పును నీవు తెలిసికొనుట సులభము కాదు. గనుక, నీవు బాగుపడ దలచుకొన్నచో ఎవడు నీమీద ఎంత తప్పును ఆరోపించినను, దానినంతయు ఒప్పుకొనుట మేలు. నీలో తప్పు చేయుటకు ఎంత సామర్థ్యమున్నదో వాడు ఎత్తి చూపించుచున్నాడన్న మాట. మనలో పెద్ద పెద్ద యజ్ఞములు చేయుటకు శక్తి యున్నట్లే, పెద్ద పెద్ద హత్యలు చేయుటకు కూడ శక్తి యున్నది. ఇప్పుడు వానిని చేయకుండినను ఏమున్నచో, దానికి మన పూర్వపుణ్యము బాగున్నదన్న మాట. కాబట్టి ఎవడైన ఏదైన మనమీద ఆరోపించినచో, ఇంత తప్పునకు కూడ మనయందు అవకాశమున్నదేమోయని గ్రహించి, ఎదుటివానికి మనలను గూర్చి అట్లు భావించుటకు కారణములైన లక్షణములు మనలో ఏవి యున్నవో పరిశీలించి వానిని పరిపూరించుకొనుటకు ప్రయత్నింపవలె.

"నేనెవడను" అని తెలిసికొనదలచుకొన్న వానికి ఈ ప్రయత్నము సులభమే - ఈ జిజ్ఞాసలో మొదటి ప్రశ్న: నేను చచ్చిపోయిన తరువాత ఉందునా?" ఉన్నదే. నేను చచ్చిపోవుచున్నానా, లేక చచ్చిపోవుచున్న దానిని చూచుచున్నానా? నేను

చున్నది! ఒక్క స్వాములవారు ఒక శిష్యునకు "ఇది యంతయు బ్రహ్మమే" అని బోధించినాడు ఇంతలో ఒక ఏనుగు మదించి ఆ వీధిలో వచ్చుచుండెను. పై నున్న మావటివాడు, "తప్పుకోండు, తప్పుకోండు" అని కేకలు వేయుచుండెను. అప్పుడా శిష్యుడు, అంతయు బ్రహ్మమే అని గురువుగారు చెప్పినారు కదా, అని తప్పు కొనకుండ దారిలోనే నిల్చియుండెను. స్వాములవారు మాత్రము జను లందఱితో పాటు ముందే పారిపోయినారు ఏనుగు ఆ శిష్యుని తొండముతో ఎక్కడికో విసిరి పోయినది వాడు చావునకు తప్పి కాలు విఱిగి గురువుగారి యొద్దకు పోయి "స్వామీ! అంతయు బ్రహ్మ మని చెప్పినారు కదా! మీ రేల పారిపోయిరి? మన మెందుకు తప్పు కొనవలె?" అని యడిగినాడు. అప్పుడా గురువు "ఏనుగుపై నున్న మావటివాడు కూడ బ్రహ్మమే కదా! ఏనుగు, మావటివాడు, వాని యఱపులు, మనము తప్పుకొనుట, ఇది యంతయు బ్రహ్మము కాదా? కాబట్టి చెప్పిన మాటను జాగరూకతతో విచారించి గ్రహింపవలె" అని బోధించినాడట

భగవద్గీత అర్థమైనచో సంసారము సకారణముగా నశించునని శంకరులవారు చెప్పినారు కదా! అట్లు మనము కూడ గ్రహించు న్నామా? బాల్యము పోయినది యౌవనము వచ్చినది తిరిగి బాల్యము రాదు. అట్లే చావు అనగా ఈ దేహము పోయి యింకొక దేహము వచ్చుట అని, బాల్యము పోయి యౌవనము వచ్చినప్పుడు బాల్యము మరణించినదని మనము గ్రహించు చున్నామా? లేదు కాబట్టి శాస్త్ర వచనమును మెలకువతో అర్థము చేసికొన్నగాని వ్యాఖ్యవనగా నేమో అర్థము కాదు. కావుననే "అజ్ఞానముగల భూతములన్నియు నిద్రించు వేళ ఇంద్రియ నిగ్రహము కలవాడు మేల్కొనును. అవి మేల్కొనియుండు వేళ ఆత్మజ్ఞానము కలవాడు నిద్రించును.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతోమునేః ॥ అ: 2 శ్లో॥ 69

అని మొదలగు శాస్త్రవచనముల తాత్పర్యమును చక్కఁగా గ్రహింపలేకున్నాము. అందువలననే లోకులందఱు దీని పేరు విన్నంతనే భయమందుదురో అట్టి మరణము, తెలిసిన మతికి మంగళమే యని పెద్దలు చెప్పుచున్నారు. ఇందులకు తార్కాణముగా సోక్రటీస్ వృత్తాంతమునే గ్రహింపవచ్చును. "ఆత్మ విచారణ చేయువాఁడే తత్త్వజ్ఞుఁడు అని చెప్పఁబడును. మృత్యువును గూర్చి విచారించుచు, దాని చేత ఎప్పుడును ఏ వికారమును పొందని యాత్మను గుర్తించి, యీ జన్మతో తాదాత్మ్యమును వదలిపెట్టి, ఆత్మస్వరూపుఁడై మృత్యువు వలన ప్రమాదమును చెందక హాయిగా నుండువాఁడే తత్త్వజ్ఞుఁడు. నా పని యావత్తును ఇదియే. ఆ మృత్యువు ఎప్పుడు ఎట్లు వచ్చునో అని యనుకొనుచుండఁగా, ఇంత అయాచితముగా అనుకొనకుండా సులభముగా దానిని తెచ్చిపెట్టుచున్న ఈ మరణశిక్ష ఎంత పుణ్యము" అని సంతోషముతో సోక్రటీస్ ఆ మరణశిక్షను స్వీకరించినట్లు మనము చదివితిమి కదా ! మృత్యువునుగూర్చి యిట్లు తలంచుట సులభమా ? మృత్యువును చూచి వచ్చి మఱొకనితో చెప్పుటకు వీలులేదు. అధికారపురుషులకు చచ్చుట పుట్టుట అనఁగా ఒక గదిలోనుండి మఱియొక గదిలోనికి మాఱుట వంటిదేయని చెప్పుదురు. ఈ ప్రకారము మన కంతఱును తెలిసినచో బాగుగనే యుండును. ఈ జన్మలో యిట్లు ఉన్నాము కదా ! పై జన్మలో ఎట్లుండునో అని విచారించము. "భోగాపేక్ష తొలంగె పూజ్యత చెడెన్ ...... " అని మొదలుగా ముసలితనపు వర్ణనములను చదువుచున్నను దానిని గూర్చి మన విషయముగా ఆలోచింపము. ఇట్లు మాఱుట చావునకే కదా అని గ్రహింపము. మృత్యువు వచ్చు సమయమునకు మనము జీవితములో చేసిన పాపములన్నియు ఎదురుగా కనబడుచుండును. అది చాలా భయంకరముగ నుండును. ఆ భయమును తప్పించుకొనవలె నన్నచో ఇప్పుడే దుశ్చరితమునుండి విరమింపవలెను. సద్వర్తనము నవలంబించి ఆత్మ విచారణము చేయుచుండవలెను.

## ౩. తెలుసుకొని చచ్చుట మేలు.

ఏ మతమువాఁడైనను చచ్చును. చచ్చినవాఁడు మరల ఆ శరీరముతో తిరిగి రాఁడు. కాఁబట్టి తన్నుగూర్చి తెలుసుకొని చచ్చుట మేలు. మృత్యువును చూడఁగలవాఁడే తన్ను తాను చూచుకోఁగలడు. మనము చచ్చుచున్నామా ? చావును తెలిసికొనుచున్నామా ? దేనిని మనము చూడవలెనో అది మన యెదుట నుండవలెను గదా ! నీవు నీ చావును చూడవలెనన్నచో, నీవు చావని దే నీ యెదుట నీ చావు ఎక్కడినుండి వచ్చును! చచ్చుచున్న నీవు, చూచుచున్న నీవు అని యొక్కడవే రెండు విధములుగా నున్నావు. చావును చూచుట పూర్తియైన తరువాత చూచుచున్న నిన్ను నీవు తెలిసికొనఁగలవు. హరిశ్చంద్ర నాటకములో లోహితాస్యుడు చచ్చిపోవుటను చూతురు. అది నటన. అందువలన లోకములో చావును చూచినప్పుడు కలుగునట్టి దుఃఖము అప్పుడు కలుగుటలేదు. అట్లే నీ జీవితమును గూడ నీవు ప్రేక్షకుఁడవుగా చూడఁగలిగినచో ఇదియు నటనగానే తోచును. నిన్నుగురించి నీవు పుట్టినట్లు పెరిగినట్లు, జీర్ణించుచున్నట్లు తెలిసికొనుచున్నావు గదా ! ఈ తెలిసికొనుచున్నవా డెవడు ? నీ వెవరు ? అని అడిగినచో "నేను రామారావును" అని చెప్పుదును. ఆ వాక్యమును పూర్తిగా చెప్పినచో "నేను రామారావునయి ఉన్నాను" అ చెప్పవలె ఈ వాక్యములో రెండు భాగములు కలవు ! "నేను ఉన్నాను; రామారావును అయినాను" అగుట అనునది రామారావునకు చెందుచున్నది. ఏది అగునో అది నశించును. That, wich becomes will perish కాబట్టి ఈ అయిన రామారావు చచ్చును. ఉన్నాను అనునది "నేను" నకుసంబంధించినది. ఏది ఉండునో అదియెప్పటికిని ఉండును. (That, wich exists, wil always exist). కాబట్టి ఈ ఉన్న నేను రామారావుగా అగుటకు పూర్వము, అయినప్పుడు, పోయిన తరువాత, ఎప్పుడును ఉన్నాను.

ఈ ఉన్న నేను ఇప్పుడు రామారావును అయివున్నాను; ఈ రామారావు చచ్చిన తరువాత మరల కృష్ణారావునో, వెంకయ్యనో, పుల్లయ్యనో అగుదును. ఎన్ని పర్యాయములు ఏమిగా అయినను నేను మాత్రము నేనుగానే ఉండును. నామరూపములు పోవునుగాని, అసలు వస్తువు పోదు. (Substratum underlying the various name and forms will never be destroyed.) ఈ నామ రూపములు దేనివి ? నావి. కాబట్టి నాకు నాశము లేదు. I am the substratum of all my names and forms and ence I will never be destroyed.) ఈ రామారావు అను పేరు నేను కాను. ఇది వ్యవహారము కొఱకు పెట్టిన పేరు. పుట్టి నప్పుడు పేరే లేదుకదా ! పుట్టిన పిల్లవానిని "నీవు" "నీవు" అను ఆ ముంతో పలుకరింతురు. అట్లు ఇతరులకు "నీవు" అయిన "నేను" ఎవరినో తెలిసికోవలెను. పేరు పెట్టునప్పుడు ముందు నక్షత్ర నామము, మాస నామము వచ్చి చివరకు వ్యావహారిక నామము వచ్చును. ఇవి పుట్టుకతో వచ్చినవి కావు ఏ పేరు లేనప్పుడు పుట్టిన పిల్లవాఁడు చిటిక వేసి పలుకరించినంతనే మనవంక చూచును. తరువాత దిన ములు గడచిన కొలఁది వ్యావహారిక నామముతో తాదాత్మ్యమును పెంచుకొనును. ఏది మనదిగా భావించుచుందుమో, దానితో మనకు తాదాత్మ్యము మనకు తెలియకుండగనే పెరుగుచుండును.

ఈ నామరూపాదులను వదలి నిన్ను నీవు చూడవలె నన్నచో పుట్టుట చచ్చుట అను క్రియలకు కర్తవైన నిన్ను చూచుచుండ వల యును. ఎవఁడు పుట్టుచున్నాఁడో వాఁడే చచ్చుచున్నాఁడు. కర్త లేక క్రియలు జరుగవు. కాఁబట్టి క్రియలకు ఆశ్రయుఁడైన వాఁడు ఆ క్రియలకు భిన్నముగానే యుండును. పోవుట అను క్రియ జరిగిన తరు వాత అట్లు పోయినవాఁడు ఎట్లు మరల ఇంకొక పనికి ఆశ్రయుఁడై మిగిలియున్నాఁడో, అట్లే చచ్చుట అను క్రియ జరిగిన తరువాత కూడ

ఆ క్రియకు ఆశ్రయుఁడ వైన నీవు కూడ లోకాంతరమునో, దేహాం
తరమునో పొందుట అను మఱియొక పనికి ఆశ్రయుఁడవుగా
మిగిలియుందువు. వేషము వేసినప్పుడు హరిశ్చంద్రుడుగా కష్టసుఖముల
ననుభవింతుము. వేషమును వదలినంతనే ఆ పాత్రకు సంబంధించిన
కష్టసుఖములు పోవును గాని, వేషమును వేసిన మనము పోము. ఇట్లు
విచారించుకొనుచున్నచో శరీరమునకును మనకును భేదమును చూచు
చుండగలము. ఇట్టి విచారణకు ఒక్క విషయము మీఁద బుద్ధిని
ఏకాగ్రముగా నిలుప వలయును. కాని మన బుద్ధి సాధారణముగా
నానా విషయములపై ప్రసరించుచుండును. ఏకాగ్రముగా చూచుట
నేర్చుకోవలెను. అనఁగా వ్యవహారమును తగ్గించుకోవలె. అగ్నికి
లుగు వస్తువుల నందించినచో అది నాలుగు వైపులకు ప్రసరించును.
´ వస్తువునే అందించినచో అది యేకాగ్రముగా దానియందే ప్రస
చును. మన బుద్ధి కూడ ఇట్టిదే. మనము ఇప్పటి పరి తులలో
నేను ఎవఁడను" అను నొక్క దానిమీఁదనే మనస్సును ఏకాగ్రము
చేసికొనుట సులభము కాదు. కాబట్టి సంసారములో మనకు సంబం
ధించినంత వఱకే, అందులోను అత్యంతము ఆవశ్యకములైన వాని
యందే మన మనస్సును ఉంచవలయును. చక్కగా విచారించినచో
ఇప్పుడు ఆవశ కములుగా తోచు పెక్కు విషయములు యదా ము
లుగా అనావ శ్యకములనియే గ్రహింతుము.

## 4. ప్రమాదమే మృత్యువు

ధృతరాష్ట్రుఁడు బిడ్డలపై గాఢమైన ప్రేమ కలిగియుండెను.
వారికి వినాశము సంభవించినచో దానివలన తనకు గలుగు బాధను
తొలగించు నుపాయమును చెప్పుమని అతడు విదురుని అడిగినాడు.
తత్త్వజ్ఞానమును పొందినగాని దుఃఖము పోదు అని విదురుడు అతనికి

తత్త్వోపదేశము చేయుటకై సనత్సుజాతుని స్మరణ మాత్రమున రావించి నాఁడు అప్పుడు ధృతరాష్ట్రుడు, "ఏవో కర్మలు చేసి మృత్యువును తప్పించుకోవచ్చునని కొందఱు అనుచున్నారు. దేవాసురులు తపస్సు చేసి మృత్యువును తప్పించుకొన్నారట. మఱి నీవు మృత్యువే లేదని చెప్పుచున్నావఁట ఈ రెండింటిలో ఏది సత్యము ?" అని సనత్సుజాతుని అడిగినాడు. అప్పుడు సనత్సుజాతుడు 'ప్రమాదమే మృత్యువు; అప్రమాదములో నుండుటయే అమృతత్వము" అని చెప్పెను. "నేను దేహము" అని యనుకొనుటయే ప్రమాదము. "ఈ దేహమే నేనా" అని విచారింప మొదలుపెట్టినచో ఈ ప్రమాదము తొలగును. ఈ దేహము పుట్టినప్పు డెంత యున్నది ? ఇప్పు డెంతయున్నది ? ఎప్పటి దేహము నేను? దేహములో మార్పు ఉన్నట్లుగా "నేను"లో ఏమైనా మార్పు ఉన్నదా ? "నేను" ఎప్పుడును ఒకటిగనే యున్నానా ? ఈ శరీరమే నేనను భావము గాఢముగ నున్నది. ఈ శరీరమే నేనైనచో మాతృగర్భములో ఎట్టి శరీరముతో నున్నాను ? శరీరశాస్త్ర దృష్టితో మొదట నేను రేతో బిందుమాత్రుడనే కదా ! (I was only a drop of semen in the beginning) అంతకు పూర్వము నేనున్నానా, లేనా ? లేకున్నచో రేతో బిందువు నెట్లయి యుందును ? ఎక్కడి రేతో బిందువు, ఎక్కడ ఈ శరీరము? ఒక చిన్న బీజములోనుండి ఎంత మఱ్ఱిచెట్టు వచ్చుచున్నది ? ఇంతకు మించిన యింద్రజాలమేమున్నది ? ("ఏ తస్మాత్ కి మివేంద్రజాల మపరమ్" — పంచదశి) ఈ శరీరము నందు ఎన్ని మార్పులు కలుగుచున్నవి! రేతోబిందువునుండి మరణమువరకును కలుగుచున్న మార్పులన్నియు ఒక శరీరమునకే సంభవించుచున్నవని యెట్లు గ్రహించుచున్నాము. ఒకఁడున్నప్పుడు చచ్చిపోయిన తరువాతకూడా జనులు వానిలోని కొన్ని విశిష్టములైన రూపురేఖలనుబట్టి (Features)

వానిని గుర్తించు చుండురు. చిత్రగుప్తుని లెక్కలలో ఈ రూపరేఖ లను బట్టియే శిక్షలు విధింపబడు చుండును. మనము చేయుచుండు పాప పుణ్యముల యొక్క లెక్కలు ఎప్పటి కప్పుడు గుప్తముగా, అనగా ఎవర కెవ్వరికిని ఏమియు తెలియకుండ రహస్యముగా, తయారు చేయబడు చుండును. అవి అంత రహస్యముగా ఏర్పడు చుండుట వలననే చిత్రములు, అనగా ఆశ్చర్యకరములు. (wonderful secret recordings.) ఇంకొక జన్మవచ్చి నప్పుడు ఈ రూపరేఖలు (features) పోవును. ఇంకొక జన్మ అనగా క్రొత్త రూపరేఖలన్నమాట. ఏది మారినను ప్రాణము మారదు. నిద్రలో ప్రాణముండును గదా!

మనకు ఈ రూపరేఖల శరీరముకాక ఇంక రెండు శరీరము లున్నవి; కారణ శరీరము (Causal body; అజ్ఞానము), లింగ శరీరము (Desire; కోరిక) వీనిని గూర్చి బృహదారణ్యకమున వివరముగా గలదు (4-4-2). అజ్ఞానమువలన కోరికలు, వానివలన దేహములు కలుగుచున్నవి. సుఖములేదు గనుక మనము సుఖము కొఱకు ప్రయత్నము చేయుచున్నాము. నీవు సుఖస్వరూపుడవు అని శాస్త్రము చెప్పుచున్నది. "నేను సుఖస్వరూపుడను" అని తెలియక పోవుటవలన కోరికలు కలుగుచున్నవి. కోరికలను కర్మేంద్రియ జ్ఞానేంద్రియములవలన అహంకారమువలన తీర్చుకొనుచున్నాము. మనము సామాన్యముగా ఆలోచించుచు (Thinking generally) ప్రత్యేకముగా (specially) అనుభవింతుము. భార్య కావలయునన్నది సామాన్యమైనకోరిక. ఆకోరికను ఒక స్త్రీవలనపొందుదుము. ఆయువతి చనిపోయినచో, మరల భార్యకావలయునని సామాన్యమైనకోరిక యుదయించును. ఈలాగే శరీరము పోయినపుడుకూడ మఱియొకశరీరము కావలయునని కోరికపుట్టును. చచ్చిపోవునప్పుడు సామాన్యమైన ఈకోరిక, లేదా వృత్తి కలిగి, దానివలన ప్రత్యేకమైన దేహము (a special body) కర్మాధీనముగా కలుగును. శాస్త్రాచార్యోపదేశముచేత సంస్కరింపబడి, దుశ్చరితము నుండి విరమించిన బుద్ధి యున్నచో మృత్యువు సంభవించునప్పుడు ఏమి జరుగునో తెలిసికొనవచ్చును.

చావు అనఁగా "ఏకీభవతి" అని మొదలుగా బృహదారణ్యకమునందు వర్ణింపబడి యున్నది. మరణించుచున్న వానిని చూక్షునేత్రేంద్రియము సూక్ష్మ శరీరముతో ఏకీభవించినప్పుడు లోకులు 'అతఁడు చూచుట లేదు' అని చెప్పుదురు ఘ్రాణేంద్రియము ఏకీభవించినప్పుడు, 'అతనికి వాసన తెలియుట లేదు' అని చెప్పుదురు. రసనేంద్రియము ఏకీభవించినప్పుడు, 'అతనికి రుచి తెలియుట లేదు' అని యందురు. వాగింద్రియము ఏకీభవించినప్పుడు, 'అతఁడు మాటాడుటలేదు' అని చెప్పుదురు. శ్రోత్రేంద్రియము ఏకీభవించినప్పుడు, 'అతఁడు వినుట లేదు' అని యందురు. బుద్ధి ఏకీభవించినప్పుడు, 'అతఁడు తెలిసికొనుట లేదు' అని చెప్పుదురు............ అప్పుడు హృదయము యొక్క అగ్రము ప్రకాశమాన మగును. అట్లు ప్రకాశించుచున్న హృదయాగ్రము నుండి జీవుఁడు వెలువడి కన్నులో నుండి గాని, మూర్ధము నుండి గాని, శరీరములోని యే యితర భాగము నుండి యైనను నిష్క్రమించును. జీవుడు వెలువడు నపుడు అతనిని ప్రాణము ననుసరించును. ప్రాణము వెలువడు నపుడు దానిని ఇంద్రియములనుసరించును. అప్పుడు జీవునకు ప్రత్యేకమైన తెలివి కలుగును. ఆ తెలివికి సంబంధించిన శరీరమునే ఆ జీవుఁడు పొందును. బుద్ధి కర్మ. పూర్వ ప్రజ్ఞయు ఆ జీవు ననుసరించును."

ఈ శరీరము నధిష్ఠించి జీవుడున్నాడు. శరీరము నశించినప్పుడు ఆ జీవుడీ శరీరమును వదలిపెట్టి పోవును. సూర్యుడు, భూమి, చంద్రుడు మొదలైన మండలములకు కూడ ఇట్లే అధిష్ఠాన దేవత లున్నారు. చంద్రుడు అనఁగా చంద్రమండలము కాదు. దాని నధిష్ఠించిన జీవుడు. ఈ యధిష్ఠాన దేవతలను గుర్తించుట యిప్పటి భౌతిక శాస్త్రమునకు (Modern Science) తెలియదు. అందు వలననే మనము జీవుని రాకపోకలను తెలిసికొనలేకున్నాము. మరణకాలమున కరణము లన్నియు హృదయములో ఉపసంహారణము

కాఁగా, దాని యొక్క ప్రవాహ్యాంతిత్వము యందుండి జీవుఁడు నిష్క్ర
మించును. ఇట్లు ఒకఁడు చెప్పుచున్నప్పుడు అతఁడు తెలిసియుండి
యనే గదా చెప్పును. సప్న కాలమునందు క్రొత్త జ్ఞానము వచ్చు
నట్లు, శరీరము పడిపోవుప్పుడు కూడ విశేష జ్ఞానము కలుగును.
కర్మవశమున ఆ విశేష జ్ఞానము కలుగును జాగ్రదవస్థలో వలె
మరణించునప్పుడు కలుగు ఆ విశేష జ్ఞానమును, లేదా వృత్తిని
మనము తెలిసి తెచ్చుకొనలేము. బుద్ధిపూర్వకముగా మరణించు
అప్పటి వృత్తిని, ఆ విశేష జ్ఞానమును స్వతంత్రముగా తెచ్చుకో
గలిగినచో కృతార్థుడవే. ఆ సమయములో ఏవృత్తి గావలెనని
నీవు కోరుచున్నావో, దాని కొఱకు ఇప్పటి నుండియు ప్రయత్నించు
చుండవలయును. అనగా దానిని గూర్చియే యెల్లప్పుడు భావించు
చుండ వలయును. కర్మయొక్క వేగము అనివార్యము. ఎంత
పెద్ద మందలో నున్నను తన పిల్లను గొఱ్ఱె వెతకి పట్టుకొనునట్లు
పూర్వ కర్మ కూడ జీవుని పట్టుకొని క్రొత్త శరీరములో పెట్టును.

మరణించిన తరువాత తన్ను పొందవలయు నన్నచో ఏమి
చేయవలయునో శ్రీకృష్ణ భగవానుడిట్లు చెప్పినాడు "కౌన్తేయా!
ఎవడు ఏ భావమును స్మరించుచు కళేబరమును తుదకు త్యజించు
చున్నాడో అతడు ఆ యా భావమునే ఎల్లప్పుడు భావించి యుండిన
వాడగుటచే, ఆ యా భావమునే పొందుచున్నాడు. కావున సర్వ
కాలము లందును నన్ను స్మరింపుము. యుద్ధము చేయుము. నా
యందే ఉంచఁబడిన మనస్సు బుద్ధి కలవాఁడవై నన్నే పొందెదవు.
సంశయము లేదు"

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్ ।
తం తమే వైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥
భగవద్గీత 8—6

శ్లో॥ తస్మాత్ సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్యస్య సంశయః ॥

భగవద్గీత 8-7

యోగీశ్వరులైన వారికి మరణ సమయము, అప్పుడు వచ్చు వృత్తి, దాని వలన కలుగు నూతన దేహమును తెలియును. జ్ఞానము వచ్చిన తరువాత కూడ కొందఱు మరల జన్మ ఎత్తవచ్చును. అధికార పురుషులు సంకల్ప పూర్వకముగానే జన్మించుచుందురు.

కర్మయొక్క విధానము తెలిసికొన్నచో చాల లాభముండును. మనుష్యునకు తప్ప ఇతర జంతుజాలమునకు దీనిని తెలిసికొను అవకాశము లేదు. జంతువులకును కొంత జ్ఞానము లేకపోలేదు. ఒక్కొక్క జాతికి ఒక విశేషమైన జ్ఞానముండును. ఆవు దూడ దృష్టి వేఱు గేదె దూడ దృష్టి వేఱు. కాకి చూపు వేఱు. డేగ చూపు వేఱు. జీవునకు కలుగు ఉపాధి భేదమును బట్టి జ్ఞానము మాఱుచుండును మనుష్యునకు తాను మనుష్యుడనని. పుట్టితి నని, పెరుగుచున్నానని చచ్చిపోవుదునని తెలియును. ఇతర జీవులకు, అనగా జంతువులకు తెలియదు. ఇట్లే పుణ్య పాపముల సంగతి వానికి తెలియదు. మనుష్యులకు తెలియును. పుణ్యఫలమును కోరుదురు కాని పుణ్యములు చేయరు. పాపకృత్యములను చేయవలదన్నచో మానరు. రహస్యముగనో బహిరంగముగనో పాపములు చేయుచునే యుందురు. తప్పులు దిద్దుకొమ్మన్నచో దిద్దుకొనరు. ఉన్నది ఉన్నట్లుగా చూచినచో కర్మ విధానము తెలియును. జన్మమును బాల్యాద్యవస్థలను, తప్పులను, ఒప్పులను, వాని ఫలములను చూడవలె. వీనిని తెలిసికొనుటకు వైదిక కర్మాచరణమే ముఖ్య సాధ

నము. సర్వ శాస్త్రముల యొక్క ముఖ్య తాత్పర్యము దుశ్చరిత
ములను మానుకొనుటయే. మనకు యేమియు తెలియకుండగనే
మనము వచ్చుట ఏమిటని దృఢ సంకల్పము చేసి తెలిసికొనవలె నను
కొన్నచో తప్పక తెలిసి కొందుము. దానికి సాధనమైన వైదిక
కర్మాచరణమును కూడ అవలంబింతుము ఎట్లైనను ఆత్మ విచారణ
వదలరాదు. యోగము నవలంబించిననే తప్ప ఆత్మను చూడ
లేము. యోగ మనగా ముఖ్యముగా ఆత్మ విచారణయే. పరా
శక్తి విచారణ రూపముగా మారిననే తప్ప విచారణ చేయలేము.
ఇప్పుడిట్లు విచారణ చేయగలుగుచున్నా మన్నచో వేల కొలది
జన్మల పుణ్యఫలము వలననే ఇది జరుగుచున్నదని తెలిసికొనవలె

— శ్రీ అమృతత్వము —

మృత్యువులో అమృతమున్నదని వేదము చెప్పుచున్నది.
(అమృతమేవ మృత్యో రంతః) ఈ మాటలు మనకు పరస్పర విరుద్ధ
ముగా కన్పించుచున్నను. శాస్త్ర దృష్టితో సమంజసములే. ఒక
వస్తువు నాశనమైన దన్నచో తన స్వరూపమును చెందినదన్న మాట.
సృష్టి, స్థితి, సంహారము అను మూడును నామ రూపములకే సంభ
వించును. వస్తువునకు కాదు. పదార్థము అవినాశ్యమని
(Matter is Indestructible). అది పుట్టింపబడుట లేదు. నాశ
మొందుటలేదు అని (It is neither created nor destroyed)
ఇప్పటి శాస్త్రములలో కూడ చదువుచునే యున్నాము గదా!
కుండ నాశనమైనచో మట్టిలో కలియును. ఉంగరము నాశనమై
నచో బంగారములో లీనమగును. అనగా నాశమన్నది నామ
రూపములకే కాని అసలు వస్తువునకు కాదు. నామరూపములు
నాశనమైన తరువాత అసలు వస్తువు మిగిలియుండును.

కాబట్టి మన నామరూపములు నశించినచో, అనఁగా మనము చచ్చినచో మన స్వరూపము మిగిలియుండు నన్నమాట. అధిష్ఠానము లేకుండ సృష్టి. స్థితి. లయములు అనుక్రియలు లేవు. శూన్యములో నుండి ఏదియు పుట్టదు. ఏవస్తువులో నుండి నామరూపములు వచ్చి కొంతకాలము ఉండి మరల దానియందే లీనమగునో అది యధిష్ఠానమగును. సృష్టి సంగతి కూడ ఇట్టిదే. సృష్టికి కర్త యున్నచో, ఈ సృష్టి కాక, తరువాత ఆయన ఏమైనాడు? ఆయన ఏమైన మార్పు నొందినచో ఆయనకు కూడ మనకు వలె జన్మజరామృత్యువు లున్న వన్నమాట అది అసంభవము. ప్రపంచముయొక్క లయమునందు కూడ ఉనికి గలుగును ఈశ్వరుఁడే. సృష్టించకపూర్వము, స్థితికాలమున, లయమైన తరువాత నుండు ఈశ్వరుఁడు ఏ మార్పునకు అయినను లోనగునా? ఈశ్వరుఁడు ఉన్నాఁడు అనఁగానే మనము మన దృష్టితో ఆకాశములో ఎక్కడనో ఒక లోకముండి. దానియందు ఆయన ఉండునని యనుకొనుచుందుము. ఆయన సర్వవ్యాపియనియు భావించుచుందుము. సర్వవ్యాపియైనవాఁడు మనవలె ఒక దేహమును కలిగి ఒక లోకములో నుండి జన్మజరాది వికారములను పొందుచుండునా? మఱి ఆయీశ్వరుఁడు మార్పు లేనివాఁడై జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు అధిష్ఠాన మాత్రముగ నున్నాఁడా? సృష్టిసంగతియే విచిత్రము. ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు, ఎట్లు, యీసృష్టి జరుగుచున్నదను ప్రశ్నలు. వానికి సమాధానములు జరిగిన సృష్టినిగూర్చి విచారించునవియే కాని, సృష్టికిపూర్వము యేమిటి అను విషయమును చెప్పవు. సృష్టికి పూర్వము దేశము, కాలము, కార్య కారణ సంబంధము (Time, Space and Cousation) అనునవియున్నవా? సృష్టి లేనప్పుడు దేశకాలములను ఎవరుగాని యెట్లు గుర్తించుదురు? గుర్తించుటకు యెవరున్నారు! ఈశ్వరుఁడు మఱి సృష్టి యెట్లు చేయును! కుమ్మరివానికి మన్ను మొదలగు ఉపకరణము లున్నవి ఈశ్వరునకు అట్టి యుపకరణము లేమున్నవి? అట్టి యీశ్వరుని గూర్చి విచారించగా

ఆయన మనకు సుఖము నిచ్చును. ఆయన యిచ్చు సుఖము తాత్కాలిక మైనదా ? నిత్యమైనదా ?

పూర్వము, ఇప్పుడు, ఇక ముందును, అనగా మూడు కాలము లందును ఏది యుండునో అదియే నిత్య సుఖము. సుషుప్తియందు సుఖము లేదనుకొనుచున్నాము గదా ఇప్పుడు లేని సుఖము నిత్య మెట్లగును ! ఆ సుఖము యదార్థముగా నిత్యమైనచో మన సుఖము లేదని మనము అనుకొనుచున్న కాలములో కూడ మనకు సుఖమే యుండి యుండవలెను. ఆ సుఖము సత్యమైనచో మన మనుభ వించుచున్నా మనుకొనుచున్న సుఖము నిజము కాదన్నమాట; భ్రాంతి యన్నమాట.

అసలీ విచారణ యంతయు నేమిటికి ? వైకుంఠములోనో కైలాసములోనో ముక్తులైన జీవు లుందురు గదా ! వారిని ప్రార్థించినచో వారు వచ్చి మనకు గల యీ సందేహము లన్నిటిని తీర్చ కూడదా ? నిజమే కాని, వారు మనకు ప్రత్యక్షమైనచో వారు యదార్థముగా ముక్త జీవులని మన మెట్లు గుర్తింపవలెను ? వారు చెప్పునది సత్యమని మనము నమ్మగలమా ? శాస్త్రము భగవత్స్వరూపము అని చెప్పబడినవారి మాటలనే నమ్మలేకున్నాము గదా ! కాబట్టి ప్రతివాడును శాస్త్రీయములైన కర్మల నాచరించి చిత్త నైర్మల్యమును పొంది, తాను నమ్మిన సద్గురువు నాశ్రయించి, ఆయన యుపదేశము ననుసరించి, విచారణచే తత్త్వమును గ్రహించి కృతార్థుడు కావలసినదే తప్ప వేరు మార్గము లేదు.

## —: 6 పరీక్షిత్తునకు శుకునిబోధ :—

ఏడు దినములలో మృత్యువును పొందుదువని తెలిసినంతనే పరీక్షిత్తు ఎంతో భయపడినాడు. తక్షకుని వలన మృత్యువును తప్పించుకొనుటకై నదీ మధ్యమున ఏడు అంతస్తుల మేడ కట్టుకొని

కూర్చున్నాడు. మహర్షు లందరు ఆయన చుట్టు చేరినారు. ఆయన యొక్క ఉద్దేశ్యము వలన శుక మహర్షియే అప్పటికి వచ్చినాడు. తనకు ఏడు దినములలో ముక్తి కలుగునట్టి యుపాయమును చెప్పుమని పరీక్షిత్తు ఆయనను ప్రార్థించినాడు. శుకమహర్షి ముకుందుడే ఆయన కూడ ఏదో యొక మంత్రముతో ఒక క్షణములో పరీక్షిత్తునకు కలిగిన సంశయములను అన్నింటిని తీర్చలేదు. ఆ ఏడు రోజులు భగవంతుని యవతార విశేషముల మూలమున తత్త్వోపదేశము చేయుచునే యున్నాడు. ఇంత చేసినను పరీక్షిత్తునకు మృత్యుభీతి తీరలేదు. చివరకు శుక మహర్షి యిట్లు ఉపదేశించినాడు "విప్ర వాక్యమున చోదితుండైన తక్షకుడు నిన్ను దహింపజాలడు. మృత్యువులకు మృత్యువైన యీశ్వరుని మృత్యువు దహింపజాలదు. 'పరంధామమైన బ్రహ్మమును నేనే; పరమపదమైన బ్రహ్మమును నేనే' అని భావించుచు నిష్కలమైన యాత్మయందు మనస్సును నిలిపి. విషాననములతో నాలుకలు చాపుచు నీ పాదమునందు కాటువేయుచున్న తక్షకుని, నీ శరీరమును ఈ జగత్తును ఆత్మకన్న భిన్నముగా చూడవు."

శ్లో॥ చోదితో విప్రవాక్యేన న త్వాం ధక్ష్యతి తక్షకః ।
మృత్యవో నోపధక్ష్యన్తి మృత్యూనాం మృత్యుమీశ్వరమ్
శ్లో॥ అహం బ్రహ్మ పరంధామ బ్రహ్మాహం పరమంపదమ్।
ఏవం సమీక్షన్నాత్మాన మాత్మన్యాధాయ నిష్కలే॥
శ్లో॥ దశన్తం తక్షకం పాదే లేలిహానం విషాననైః।
న ద్రక్ష్యసి శరీరం చ విశ్వం చ పృథగాత్మనః।
(స్కంధ 12. అధ్యా 5 శ్లో 10, 11, 12)

అప్పుడు పరీక్షిత్తు కృతార్థుడైతినని శుకునితో ఇట్లు చెప్పినాడు "కరుణాళుడవైన నీచేత సాక్షాత్తుగా అనాది నిధనుడైన హరిని గూర్చి విని అనుగ్రహింపబడితిని సంకల్పసిద్ధి

నొందితిని అజ్ఞులై సంసార తాపతప్తులైన జీవులయందు అచ్యుతాత్ములైన మహాత్ములకు అనుగ్రహము కలుగుట అత్యద్భుతముగా నేను తలంచుట లేదు.

శ్లో॥ సిద్ధోఽస్మ్యనుగృహీతోఽస్మి భవతా కరుణాత్మనా।
శ్రావితో యచ్చ మే సాక్షాదనాది నిధనో హరిః॥-2

శ్లో॥ నాత్యద్భుత మహం మన్యే మహతా మచ్యుతాత్మనామ్।
అజ్ఞేషు తాపతప్తేషు భూతేషు యదనుగ్రహః॥
-శ్రీ(స్కంధ. 12-అధ్యా.6)

తక్షకుని, అతని కోరలను, తనను కఱచుటను, తన దేహమును ఈ విశ్వమును తనకన్న భిన్నముగ చూడవద్దని పరీక్షిత్తునకు శుకుఁ డుపదేశించినాఁడు, మనము కూడ మన సంసారమును ఇట్లా మనకన్న అభిన్నముగ చూడవలె. కలలో కన్పించిన ప్రపంచమును మనకన్న భిన్నముగ చూచుచుందుము. కాని అప్పుడు మనకన్న భిన్నముగ నేదియు సంభవము కాదు. కలలో జరుగున దంతయు మన మనస్సునందే జరుగుచున్నది. అట్లే మెలఁకువ వచ్చిన తరువాత కూడ ఈ జాగ్రత్ప్రపంచ మంతయు మన మనస్సు యొక్క విలాసమే. అనఁగా పుట్టినది మొదలు చనిపోవు వఱకు జరుగు వ్యవహారమును నీకంటె భిన్నముగా చూడ వద్దని శుకమహర్షి పరీక్షిత్తునకు చెప్పినాఁడు పరీక్షిత్తు దానిని తెలిసికొని మోక్షము పొందినాఁడు. పుట్టుట పెరుగుట తక్షకుఁడు కఱచుట మొదలగు వానిని నీకంటె భిన్నముగా చూడ వద్దనఁగా, అవి కేవలము లేవు అని యర్థము గాదు. పరీక్షిత్తు వానిని తనయందే తన స్వరూపమునకు అభిన్నముగా, కలలో జరుగుచున్న సర్వము తన మనస్సునకు అభిన్నముగనే జరుగుచున్నట్లు గ్రహింపవలయు నని యభిప్రాయము.

ఇట్లు గ్రహించుట సులభము కాదు. పరీక్షిత్తునకు మరణభీతి ప్రబలమై యితర కామక్రోధాది సకల సంసార వృత్తులను అణచివేసి చిత్తము నంతయు ఆక్రమించియున్నది. అట్టి స్థితిలో శుకమహర్షి ఏడు దినములు నిరంతరము హరిలీలా విశేషములను మహా ప్రభంజనముతో మృత్యుభీతి యను వృత్తిని పెకలించి పరీక్షిత్తు యొక్క చిత్తమునందు బ్రహ్మాకార వృత్తిని పాదుకొల్పుటకు ప్రయత్నించినాడు. అందువలన పరీక్షిత్తు శుకమహర్షి బోధించుచున్న వాసుదేవ పరబ్రహ్మమును భావించి భావించి, ఆవృత్తితోనే కళేబరమును త్యజించి ఆ పరబ్రహ్మమునందు లీనమైనాడు.

# విచారణ

## 1. మతగ్రంథములు

విచారణ మన దేశములో అనాది సిద్ధముగ నున్నది. పూర్వము మన దేశములో అనేక మతశాస్త్ర గ్రంథములు వెలసినవి. మనకు శాస్త్ర దృష్టి సహజము. మనము ఏ విషయమును గూర్చి యైనను సహేతుకముగా విచారింతుము; మూర్ఖముగా దేనిని నమ్మము. అట్లే యితరుల యభిప్రాయమును కూడ పరిశీలింతుమే గాని మూర్ఖముగ తిరస్కరింపము. అందువలన మనము ఇతరుల గ్రంథములను చదివి వానిలో ఎంతవరకు సమంజసమైన విషయమున్నదో అంతవరకు గ్రహింతుము. ఇతరుల మతములలో అనగా అవైదిక మతములలో, విశ్వాసము వలె విచారణ ముఖ్యము కాదు. అందువలన వారు మన మత గ్రంథములను చదువరు; విచారింపరు. కావుననే అవైదిక మతముల వారు మన దేశముపై దండెత్తి వచ్చినప్పుడెల్ల వారు ప్రజలను భయపెట్టి, ప్రలోభపెట్టి, హింసించి తమ మతములలో కలుపుకొన్నారు. వారు సాధారణముగా మనతో విచారణకు దిగరు. వారి ప్రచారమంతయు ఇంచుమించుగా విశ్వాసమే మూలసూత్రముగా జరుగును.

నుండు శరీరమునే మనము భావింతుము గాని, ఆకలిలేని శరీర మొకటి యుండునని మనకు తోచదు. మనకు నిజముగా తెలివి యున్నచో ఆకలిలేని శరీరము కావలెనన్న కోరిక మనకురావలెను. కాని ప్రత్యక్షముగా మన యీ ప్రపంచములోని సామగ్రితో (Materals) మనము దానిని సంపాదింపలేము. వేదములలో స్వర్గము చెప్పబడి యున్నది. అక్కడ లభించు శరీరమునకు ఆకలి దప్పిక లుండవు. కావుననే పూర్వులు స్వర్గమునకై యెంతో ప్రయత్నించి నారు. అన్నమును మానుకొని లేదా తగ్గించుకొని పత్రాంబు వాయు భక్షులై తపస్సు చేయువారికి స్వర్గములో ఆకలిలేని శరీరము లభించునన్నమాట. ఆహార నిద్రాభయమైన మునులలో మనము రావణ కుంభకర్ణులకు సహోదరులముగా నున్నాము. అన్నమునకు నిద్రకు మేటి యుదాహరణము కుంభకర్ణుడు. వాడు ఆరు నెలలు నిద్రించును. వానికి నిద్రనుండి లేవగనే చట్టును సిద్ధముగా ఆహారము వుండవలెను. భయమైథునములు రావణునియందు పరకోటి నొందియున్నవి. మనలో ఈ యిరువురి గుణములు ఏకీభవించి యున్నవి. మనము ఎంతసేపటికిని ఈశరీరము, ఈలోకము, వీనిపరిధి లోనే యాలోచించుచున్నాము, కాని వీనిని దాటి యూహింపలేకు న్నాము. చీకటిలో మనశరీరము మనకు కనబడదు. సూర్యునిశరీరము స్వయంప్రకాశము. దేవతల శరీరములు తేజోమయములు. అవి తాము ప్రకాశించుటయే గాక ఇతర శరీరములను కూడ ప్రకాశింపం జేయఁగలవు. మనకు శరీరమే కావలసినయెడల అట్టి శరీరమును గదా కోరుకొనవలె ?

సుఖమును గూర్చి కూడమనము ఈ పరిధిలోనే ఆలోచించుచు చున్నాము. మనము ఊహింపగల గొప్ప యానందము మైథున సుఖమే. కాని మైథునము లేకుండ, దానివలన కలుగు సుఖము

కన్న చాలరెట్లు గొప్పదియైన సుఖమున్నది. అదే మోక్షానంద మని వేదము చెప్పుచున్నది మైథునము లేని సుఖము అనగా రెండవది ఏదియు లేని స్థితిలో కలుగు సుఖమన్న మాట, రెండవది ఏ రూపముగ నున్నను దానివలన కలుగు సుఖము మోక్షము కాదు. రెండవది ఏది యున్నను వ్యవహారము ఆరంభమగును. దానితో బాధ్యతలు ఏర్పడును. ఇంక బాధ తలనుగూర్చి చింతయేకాని సుఖమెక్కడిది ? మనము సుఖముకో సాగించుచున్న సంసారము లో కలుగుచున్న చిక్కు ఇదే కదా ! సాగనదో మన కం అవును ఏ బాధ్యతలు లేకుండ, ఏ పని చేయకుండ హాయిగా వుండవల యునని లేదా ? మరి మోక్షమనగా కదేకదా ! సంసార బాధ తలు లేకుండ సుఖము మాత్ర ముండుట. రెండవ వ్యక్తితో, రెండ వస్తువుతో సంబంధము లేకుండ నీవు కేవలుడవుగా నుండి పొందు సుఖమే మోక్షము. ఈ సంసార సుఖమును వదలినగాని అదిరాదు. నీ స్వరూపమే సుఖమని తెలుసుకొని. నీకు భిన్నముగా తోచు చున్న యనిత్య మైనసుఖమును వదలవలె. అర్జునుడు తన యనిత్య సుఖమునకు సాధనమైన యుద్ధ వ్యాపారమును వదలుకొనుటకు ర పడిన తరువాతనే భగవంతుడు తని నిత్య సుఖోపాయమును తెలిపి నాడు. నిజముగా యీ సంసారము వలననే నిత్య సుఖము కలుగు చున్నదని భ్రమించువారి నెవ్వరిని యీ సుఖమును వదలుకొను మని శాస్త్రము శాసించుటలేదు. యీ శాస్త్రమునకు అట్టివారు అనధికారులు. అట్టివారికి కర్మమార్గమున స్వర్గాది సుఖములు వుప దేశింపబడి యున్నవి నిత్య సుఖమును కోరువాడు యీ విచారణకు అడ్డము వచ్చు శోక మోహములకు మూలమును గుర్తింపవలె. అందువలననే 'భగవానుడు నీవు దుఃఖము నొందదగవు' (నాను శోచితు మర్హసి) అను నర్థముతో అనేక పర్యాయములు వుపదేశించి నాడు.

## 2. విచారణకు మొదలు.

ఎప్పుడు ఏ విచారణ ఎవరు ప్రారంభించినను తనకు తెలియదు కావుననే ప్రారంభించును అనగా విచారణకు మొదలు అజ్ఞాన మన్నమాట. కాని మనకు చాలా విషయములలో తెలియదు అని కూడ తెలియదు. పైగా మనకు సర్వము తెలిసినట్లుగా కూడా ప్రసంగించుచుందుము. దీనిని గూర్చి భర్తృహరి ఎంత చక్కగా చెప్పినాడో చూడుడు.

చం॥ తెలివి యొకింత లేనియెడ దృప్తుఁడనై కరిభంగి సర్వముం
దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి, యిప్పుడు
జ్వలమతులైన పండితులసన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాఁడనై మెలఁగితిన్ గతమయ్యె నితాంతగర్వమున్॥

నీతిశతకము–మూర్ఖపద్ధతి–ప 8

తక్కినవిషయము లెట్లున్నను వేదాంతవిషయములో మాత్రము మన మందఱము ఇట్టివారము. ఆత్మజ్ఞాన మన్నంతనే ఏదో తెలిసినట్లుఁడును. విచారింప మొదలిడినచో ఏమియును తెలియదని తెలియును. దేవుఁడనఁగా ఎవరు? ఈ ప్రపంచమెట్లు వచ్చినది? ఇట్టి ప్రశ్నలు వేసినచో బుద్ధిమంతులు "తెలియదు" అని జవాబు చెప్పుదురు. తెలియలేదని తెలిసిన తరువాత తెలిసికొనుటకువిచారించవలె. మనము పుట్టకపూర్వము ఉన్నామా లేదా? చావు అనగా నేమి? ఇట్టిప్రశ్నలకు సమాధానము తెలియ లేదుగనుక, తెలిసికొనుటకు కావలసిన ప్రమాణములనుగూర్చి విచారణ చేసి, ఆప్రమాణముల ప్రకారము తేలినదానిని చూడవలె మన బుద్ధికి తోఁచిన దంతయు సిద్ధాంతముకాదు. తాను ఊహించుకొనునది, ఇతరులవలన విన్నది, చదివి గ్రహించినది, ఇవియన్నియు తనకు తెలిసినట్లుగా భ్రమింపఁగూడదు. తెలిసినదానిని తెలిసినదిగా, ఊహించిన దానిని ఊహగా శాస్త్రాధారములతో సంబంధము లేకుండ తనకు తట్టినది, స్ఫురించినదిగా విభజించి వేఱువేరుగా గ్రహింపవలె. విచారణకు ఇది చాల ఆవశ్యము.

మనకు పుట్టుట పెరుగుట చచ్చుట తెలియును. నీవు పుట్టుట నీకు ఎట్లు తెలిసినది? అని అడిగినచో సమాధానము చెప్పలేము. కాని పుట్టినామని మాత్రము చెప్పుచున్నాము. ఈ దేహమే తానని ప్రతివానికి అభిప్రాయమున్నది. కాని దేహము నేననునది ఎప్పుడు సందేహము లేని విషయమేనా? ఈ దేహమును గూర్చియైనను మనకు సర్వము తెలియునా? ఆకలియగుట తెలియును. ఆకలిని తీర్చుకొనుట కూడ తెలియును. కాని ఈ దేహము ఎట్లు పుట్టినది? ఎందుకు పెరుగుచున్నది? దీనితో మనకున్న సంబంధమేమి? అని అడిగినచో తెలియదు.



## 3. కర్తృత్వము

మన కేమియు తెలియలేదని తెలిసిన తరువాత తెలిసికొనుటకు ప్రయత్నింపవలెంగాని, 'అంతయును ఈశ్వరుని విధి ప్రకారము జరుగుచున్నది. మన జన్మలకు, కర్మలకు, దేహములకు మనము కర్తలమా!' అని నిర్వేదమును పొందరాదు. అట్టితలంపు విచారణకు విరోధి మన జన్మలకు, కర్మలకు, మనమే కర్తలము; మనము స్వాతంత్రులము. శాస్త్రములన్నియు ప్రతిజీవుడు స్వతంత్రుడు కర్తయనియే చాటి చెప్పుచున్నవి. జీవుడు కేవలము పూర్వకర్మచేత బద్ధుడైనచో స్వాతంత్ర్యమే లేని వాడైనచో శాస్త్రములు ధర్మాధర్మములను ఎవరికి బోధింపవలె? పూర్వకర్మ ననుసరించియే జననము కల్గుచున్నమాట నిజమే. ఒక కుటుంబమునందు ఒకశరీరముతో జనించిన తరువాత ఆ కుటుంబముయొక్క ధర్మముల ననుసరించి సత్ప్రవర్తనతో అభ్యుదయ నిఃశ్రేయసములను పొందుటకుగాని దుర్వర్తనములతో దుర్గతుల నొందుటకు గాని, స్వాతంత్ర్యముండనే యున్నది పూర్వకర్మ వల

చేసిన కర్మలఫలమును అనుభవించుటయేకాని పశుజన్మలో క్రొత్తగా ఏ పనిని చేయుటకు వీలులేదు. మనుష్యత్వమును సంపాదించుకొనుటకు ఏ యమనుష జన్మలోను వీలులేదు విచారణ ఎప్పుడైన ఆరంభమగుచో ది మనుషత్వమునందే సంభవింపవలె. ధర్మాచరణముచేత ఇంద్రాదిపదవులను సంపాదించుటకుఁ గాని, విచారణ చేత బ్రాహ్మీస్థితిని పొందుటకుఁ గాని మనుష్య జన్మయే ఆధారము. కావుననే నరజన్మ దుర్లభ మని పెద్దలు చెప్పుదురు.

ఇట్టి యుత్తమమైన నరజన్మ లభించినతరువాత, అది సాకమగునట్లు విచారణకు పూనుకోవలెను గాని, ఆహార నిద్రా భయ మైథునములలో పడి పశుత్వమునకు దిగజారఁగూడదు. ఎవఁడు దేనిని గూర్చి ఆసక్తితో భావించునో వానికా జన్మ వచ్చును. పురుషునకు స్త్రీ మీఁద వాంఛ యెక్కువైనచో స్త్రీజన్మ వచ్చును. అసలు మనయానందము మరియొకదానిమీఁద ఆధారపడి యున్నచో మనకు స్వాతంత్ర్య మెక్కడిది? స్త్రీకి పురుషుఁడు బంధమైనట్లే పురుషునకు స్త్రీ బంధము స్త్రీకి పురుషుఁడు బంధమని యెవరు చెప్పఁ గలుగుదురు? కొడుకు తల్లికి తండ్రి పుత్రికకు, భర్త భార్యకు చెప్పవలెను కపిలుఁడు దేవహూతికి జ్ఞానోపదేశము చేసినాఁడు. మఱి స్త్రీలకు బ్రహ్మోపదేశమునకు అధికారము కలదా? పురుషులలో మాత్రము అందఱకును అట్టి అధికారమున్నదా? అధికారము లేదనఁగా వారికి తెలుసుకోవలెనను దృఢమైన యిచ్ఛగాని, చెప్పినను తెలుసుకొనఁగలిగిన సామర్థ్యము గాని ఉండదని అర్థము. అట్టి జిజ్ఞాస, అట్టి సామర్థ్యము ఎవరియందైన ఉన్నచో, స్త్రీలకు కూడ, తత్త్వోపదేశము చేయవచ్చును. తత్త్వోపదేశము చేసినంత మాత్రమున వారికి సన్న్యాస మీయనక్కరలేదు. జ్ఞానముకలిగిన వారందరు సన్న్యాసులు కానక్కరలేదు అట్లెల్లవారిని సన్న్యాసులుగ సన్న్యాసినులుగ చేయవచ్చుననుట అవైదిక లక్షణము. వేదధర్మమున సన్న్యాసము బ్రాహ్మణులకే నియతము.

ఈ ధర్మమునసుసరించి తత్త్వజ్ఞులలో శ్రేష్ఠులైన శ్రీకృష్ణుఁడు, జనకుఁడు విదురుఁడు మొదలగువారెవరును సన్న్యాసాశ్రమమును స్వీకరింపలేదు. భిక్షావృత్తి క్షత్రియునకు తగదనియే శ్రీకృష్ణుఁడు అర్జునునకు బోధించినాఁడు. గెలిచినచో రాజ్యము, చనిపోయినచో స్వర్గము కలుగునట్లు యుద్ధము చేయుట క్షత్రియునకు స్వధర్మము. వేదమతమునకు వర్ణాశ్రమ ధర్మములే ప్రాణము. శ్రీ శంకరులవారు గీతా భాష్యమునకు ప్రారంభమున ధర్మమునుగూర్చి యిట్లు చెప్పినారు, "ప్రవృత్తి లక్షణమని, నివృత్తి లక్షణమని వేదవిహితమైన ధర్మము రెండువిధములు. ప్రాణులకు సాక్షాత్తుగా అభ్యుదయ నిశ్శ్రేయసములకు సాధనమై జగత్తునకు స్థితికారణమైన యీ ధర్మము శ్రేయస్సును గోరుచున్న బ్రాహ్మణులు మొదలైన వివిధ వర్ణములవారిచేత, బ్రహ్మచర్యాదులైన యాశ్రమములందున్నవారిచేతను అనుష్ఠింపఁబడుచు...."

"ద్వివిధో హి వేదోక్తో ధర్మః ప్రవృత్తి లక్షణో నివృత్తి లక్షణశ్చ జగతః స్థితికారణం ప్రాణినాం సాక్షాదభ్యుదయ నిశ్శ్రేయసహేతుః యః స ధర్మో బ్రాహ్మణాద్యైః వర్ణిభిః ఆశ్రమిభిశ్చ శ్రేయోఽర్థిభిః అనుష్ఠీయమానః ...... "

స్వధర్మాచరణమువలన మంచి జన్మలను సంపాదించుకొనవచ్చునన్న విషయము వేదమతమునందే కాని యితర మతములలో కానరాదు. కావున స్వధర్మమునాచరించి మంచి జన్మమును, అందు ఆత్మవిచారణకు తగిన యధికారమును సంపాదించుకోవలెను.

మనము దేనిని విచారించినను శాస్త్రీయమైన ధర్మకర్మల పద్ధతిలో విచారించవలె. మనము కేవలము మాంసచక్షుస్సుకలవారము కాకూడదు. వేదచక్షుస్సు కలవారము కావలయును. మాంస

యొక్క ఆకృతిని పొందుటయే. మరి కామక్రోధాదులకు రూపము లేదుకదా! అయినను వానిని గ్రహించుచునే యున్నది. కావున మనస్సు దేనినైనను తెలిసికొనఁగలదు. ఆత్మతత్త్వము అవాఙ్మనస గోచరమే. కాని దానిని గ్రహించుటకుకూడ మనసు మనస్సు తప్ప వేరు సాధనములేదు. కొంత జ్ఞానము ఇంద్రియములవలన కలుగు చున్నను, జ్ఞానమంతయు వానివలననే కలుగదు. ఇంద్రియములవలన కలుగు జ్ఞానమును, శాస్త్రాచార్యోపదేశమువలన కలుగుజ్ఞానమును వేరు చేయవలయును. శాస్త్రాచార్యోపదేశముచేత సంస్కరింపఁబడిన మనస్సు కామక్రోధాదులకు దూరమై, శుద్ధమై, సూక్ష్మమై నిర్గుణ మైన యాత్మను గ్రహించుటకుకూడ సమర్థమగును.

## 6. ఆధునికశాస్త్రపద్ధతి — యోగపద్ధతి

లోకవ్యవహారమున "ఈ వస్తువేమి? దీనిలక్షణమేమి?" అను ప్రశ్నలతో భౌతికశాస్త్రములుఆరంభమగుచున్నవి. "ఈ ప్రశ్న ఏమి? ఈ ప్రశ్నించువాఁడెవఁడు" అను ప్రశ్నలతో తత్త్వశాస్త్రము (ME A PHYSICS) ఆరంభమగు చున్నది. ఉన్నదానిని ఉన్నట్టు చూచుట యోగపద్ధతిలో సాధ్యమైనట్లు భౌతికశాస్త్ర పద్ధతిలో సాధ్యముగాదు, ఒక శరీరభాగమును విచ్ఛేదముచేసి (OPERATE) చూచునప్పుడు, దానియొక్క విచ్ఛిన్నస్థితియే (POST OPERATE) గోచరించును గాని, అది శరీరములో యథాతథముగా అంగముగా నున్నప్పటి స్థితి గోచరించదు. అందువలన భౌతికశాస్త్ర పద్ధతిలో ఎప్పటికప్పుడు "నాకు గోచరించినంతవరకు". "నాకు తెలిసినంతవరకు" అని మొదలుపెట్టియే యేసిద్ధాంతమునైనఁ జేయవలె. యోగశక్తులు కలవారు ఉన్నదానిని ఉన్నట్లు చూడఁగలరు; ఒక్కసారిగా అనేక శరీరములను దాల్చి ఎన్నో భోగముల ననుభవింపఁగలరు; ప్రారంభ మైన యనుభవమునుగూడ ఆపఁగలరు. ఒకయోగి చలిజ్వరముచే

పీడింపఁబడుచుండెను. ఆయనకు సముద్రస్నానము చేయవలె నను బుద్ధిపుట్టెను వెంటనే ఆయన సముద్రము నొద్దకు పోయి ఒడ్డున దండమును పాతి, తన చలిజ్వరమును దానిపై ప్రయోగించి సముద్రములో స్నానము చేయఁజొచ్చెను ఈ లోపల ఆ దండము చలిజ్వరముచే వణఁకుచుండెను. ఆయన స్నానము చేసివచ్చి మరల ఆ జ్వరమును స్వీకరింపఁగా దండము యథాస్థితికి వచ్చెను. "నేను" ను నీ జీవునియందు ఎన్ని శక్తులున్నవో గ్రహించిననే తప పైఁజెప్పిన యోగ మహిమ తెలియదు ఎన్ని యోగశక్తులున్న ప్రారబ్ధము యొక్క అనుభవమును కొంత కాలము నిలుపఁగలరే కాని, అసలు తప్పించుకొనఁ జాలరు.

సంకల్పము క్రియ, ఫలము మొదలుగా అన్నింటికి ఆది మధ్యావసానము లున్నవి. కాని వానిని మనము గమనించము. కామముగాని, క్రోధముగాని ఆరంభమైనచో,'ఇదిగో నాకు కామము కలుగుచున్నది; కోపము వచ్చుచున్నది'అని తోఁచనే తోఁచదు. అవి బయలుదేరినంతనే సుడిగాలిలోవలె వాని వేగమునకు లోఁబడి పోవుదుము జరుగవలసిన యున్న మంతయు జరిగి అవి చల్లబడిన తరువాతనే, అవి వచ్చి యుంచిపోయినట్లుగా గుర్తింతుము. ప్రతి వృత్తి యొక్క ఆది మధ్యావసానములను చూడఁగలిగినప్పుడే ఆత్మ విచారణ చక్కఁగా సాగును వృత్తులను చక్కఁగా చూచినచో స్వప్నాను భవమునకు, జాగ్రద్దశలోని యనుభవమునకు భేదము లేదు. ఇప్పుడు జాగ్రద్దశలో సుఖ దుఃఖములు జనన మరణములు ఎంత సత్యముగా అ చుచున్నవో, స్వప్నదశలో అప్పుడు కలిగిన సుఖ దుఃఖములు, జనన మరణములు అంతే సత్యముగా తోచుచున్నవి గదా! కలను గనుచున్నంతసేపు అది యదార్థమే. ఎవఁడైనను కలలో "ఇదికల; ఇది యదార్థము కాదు" అని యనుకొనుట లేదు. మెలకువ వచ్చిన తరువాతనే అట్లనుకొనుచున్నాఁడు. ఇట్లే, "ఈ కన్పించుచున్న దంతయు అనిత్యము, అసత్యము; నాయందే ఇది యంతయు ఉన్నట్లు

కన్పించుచున్నది. అతఁడే నిత్యము, సత్యము" అని మోఁ నొందిన వానికి జాగ్రద్దశలోని యనుభవము కూడ స్వప్నానుభవలెనే అయథార్థముగా తోఁచును.

## 7. శిశువునకుఁ గూడా జ్ఞానముండవచ్చు

శరీరముమీఁద ఆధారపడి నేనున్నానని, మృత్యువు కలిగిః ఉండనని అనుకొనుటయే సంసారము. ఈశరీరము మీఁదఁగాని, జీవితము మీఁదగాని ఆధారపడక నేను స్వతంత్రుఁడనుగా ఉన్నని తెలిసికొనవలెను. జీవితము నొక దృశ్యమునువలె చూడగశక్తి కొంతమందికి శిశుత్వమునందు కూడి ఉండును. మార్కండేయపురాణములో ఒక మన్వంతరాధిపతికి ఇట్టి జ్ఞాన ముండెనని చెప్పబడి యున్నది. ఆయన శిశువుగా నుండఁగా, తల్లి మహర్షి దగ్గఱకు తీసికొనఁగా, పక్కున నవ్వినాఁడఁట కాఁబట్టి మనముః అట్టి తపస్సంపన్నుల మైనప్పుడు మనకు కూడ సర్వావస్థలయంద నిశ్చలతము ఉండును. శరీర తాదాత్మ్యముండదు ఒక పిల్లవా 'నీవు యెవరో చూపుము' అని యడుగఁగా, వాఁడు, "నన్ను చూపు యెట్లు? కనఁబడనాయె ఉన్నానాయె. ఎట్లు చూపగలను?" అన్నాఁడు అట్టి సంస్కారమును సంపాదింపవలె. మన మంతయు ఎక్కడ జరుగుచున్నది? ఎట్లు జరుగుచున్నది? విచారింపవలె. కాలము, దేశము, కార్య కారణ సంబంధ (Time, Space, & Causation) అ వానితో జరుగుచున్న వీని నెవరు చూచుచున్నారు? నేనే చూచుచున్నాను. ఎక్కి జరుగుచున్నది? స్వప్నమంతయు నేను చూచుచుండ నాలోనే యెట్లు జరుగుచున్నదో, అట్లే యీ జీవితముకూడ దృశ్యముగా నాలోనే జరుగుచున్నది "మాయ యనుమారు యొక్క విభ్రమము వలన విశ్వమును తరంతములు అఖండా సముద్రమైన నాయందే అనేకవిధములుగా పుట్టుచు గిట్టుచున్నవి.

శ్లో॥ మయ్యఖండ సుఖాంభోధే బహుధా విశ్వవీచయః ।
ఉత్పద్యన్తే ప్రలీయన్తే మాయామారుత విభ్రమాత్॥

— (వివేక చూడామణి)

కాఁబట్టి జీవితము యొక్క, విశ్వము యొక్క, ఈశ్వరుని యొక్క ఆది మధ్యావసానములను చూచినప్పుడే జ్ఞానము సమగ్ర మగును.

## 8. బ్రతుకును చూడవలె

మనము పుట్టుట, పెరుగుట, చచ్చుట మనకు తెలియును. అనఁగా ఏమ ము ? ఇదంతయు మన మేనా ? మనకు తెలియుచుం విషయము మన మగుదుమా ? ఒక పండునుగూర్చి మనము తెలి కొన్నప్పుడు ఆపండు మన మగుటలేదు. తెలియఁబడిన పండు వేఱు, తెలిసికొను చున్న మనము వేఱు. తెలియుట అను ధాతువునకు కర్మ పండు, కర్తలము మనము. కర్త, కర్మ భిన్నములే. కావున మనకు తెలియు చున్న మనపుట్టుక, పెరుగుట, చచ్చుట మనముకాము. కాని అనాది నుండి మనకు తెలియుచున్న మనపుట్టుక, పెరుగుట, చచ్చుట మొదలగు వికారము లన్నియు మనమే యనుకొనుట తటస్థించుచున్నది. కర్త, కర్మ ఒక్కటియై యుండుట తన్నుతాను తెలిసికొనుటయందు మాత్రమే సంభవము. "నను నేనెఱుఁగుదు ; నన్ను నేనెఱుఁగను" అను రెండువాక్యములలో కర్త, కర్మయు నేనే. ఇట్టిది మఱియొకటి లేదు.

హరిశ్చంద్రుని వేషము వేసిన నటుఁడు, తాను వేషముకంటె వేఱుగానున్నానని తెలిసికొనుచున్నాఁడు. అందువలన ఆవేషముతో నటించుచున్న సుఖదుఃఖములను వానిని పొందుటలేదు. అట్లే నేను నాకు తెలియుచున్న నాయంతశ్చర కంటె, అనఁగా సుఖదుఃఖాది భావముల కంటె నన్ను వేఱుగా చూచు ని తటస్థముగా నుండఁగలనా ? నేను నేనుగా ఉన్నవాఁడనై నామనస్సులో బయలుదేరుచున్న సుఖదుఃఖ ములను చూచువాఁడనైనయెడల, నేనెప్పుడు ఉన్నవాఁడను గనుక నిత్యుఁడ నగుదును. నేను నిత్యుఁడనైనచో నాచేత చూడఁబడుచు

నాకంటె భిన్నములైన జననమరణ సుఖదుఃఖాదిభావములు అనిత ములై అయథార్థ ములగును. అట్టియెడల మన మేమని చెప్పవలె నేను పుట్టినట్లు, పెరిగినట్లు, చచ్చినట్లు ఉన్నానని చెప్పవలె. కావున మన సుఖదుఃఖాద్యనుభవము లేవియు మనము కాము. స్వప్నములో మనకు కలుగుచున్న సుఖదుఃఖానుభవమునకు జాగ్రదవస్థలోనిదానికిని భేదము లేదుకదా! మఱి స్వప్నములోని సుఖదుఃఖముల వలన నేనేమియు కానప్పుడు (Unaffected) జాగ్రదవస్థలోని సుఖదుఃఖములవలన మాత్రము నిజముగా సుఖినిగా దుఃఖి (Affected) గా మారుచున్నానా? ఎట్లు స్వప్నములో నేనేమియు అగుటలేదో, అట్లే జాగ్రదవస్థలో కూడ నేనే మియు అగుటలేదు. కాఁబట్టి యీ సంసారము నంతను కలనుగా చూచినచో హాయిగానుందుము.

కలలో జరుగునదంతయు మనయందే జరుగును. అప్పుడు చూచు వాఁడను, చూడఁబడువాఁడను నేనే. కాని నిద్రావశమున కల జరుగు చున్నంతసేపు నేను నాకన్న భిన్నములైనవిషయములను అనుభవించు చున్నట్లు తలంచుచున్నాను. నిద్ర తొలఁగినంతనే ఆవిషయములన్నియు నాయందే, నాకన్న అభిన్నముగా తోఁచినవని తెలిసికొనుచున్నాను. జాగ్రదవస్థలో కూడ నింతే. మాయావశమున మనము అనుభవించు చున్నవిషయములు మనకన్న భిన్నముగా తోఁచుచున్నవి, కాని సూక్ష్మ ముగా విచారించినచో ఈవిషయములు కూడ మనమనస్సునందు వృత్తు లుగా ఏర్పడుచున్నవేకాని మనకన్న భిన్నముగా లేవు. కాని విచారణ లేకపోవుటవలన మనము చూచువారముగా, ఆవిషయములు చూడఁ బడుచున్నవిగా తోఁచుచున్నవి. చూచువాఁడు మగవాఁడైనచో, చూడఁబడునది స్త్రీయగును. మగవానియెదుట స్త్రీ యెట్లుప్రవర్తించు చున్నది? మనపైయధికారుల యెదుట మనము ఎట్లు ప్రవర్తించు చున్నాము? విధేయులమై వర్తించుచున్నాము. ఈవ్యవహారములో మనమే చూచువారముగా, చూడఁబడువారముగా కూడ ఉన్నాము. ఈయాట అంతయు ఆడునది యెవరు? చూచునది యెవరు? దీనినంతను శివుఁడు చూచునని యొకచోట, శక్తి చూచునని యొకచోట చెప్పఁబడి

యున్నది. మఱి యీ శివుఁడు, శక్తి ఒకటేనా ? భిన్నులా? నిప్పు అనఁగా కాలుటయే. నిప్పు, కాలుట అన్నవి యెట్లు అభిన్నములో, అట్లే శివుఁడు, శక్తియును అభిన్నములే. అట్లే చూచుచున్న నేను శివుఁడనైనచో చూడఁబడుచున్న నేనే శక్తినగుచున్నా నన్నమాట. ఏవస్తువుయొక్క శక్తియైనను ఆవస్తువును ఏమియును చేయలేదు. నిప్పు నిప్పును కాల్చలేదు; నీరు నీటిని తడుపలేదు. కాఁబట్టి నాశక్తి కూడ నన్నేమియు చేయలేదు. నేను సుఖినో దుఃఖినో అగుచున్నానని యను కొనుశక్తి నాకున్నది. ఈశక్తికూడ నన్నేమియు చేయలేదు. చచ్చిపో వుదుననికూడ నాకు తెలియును. నాచేత తెలిసికొనఁబడుచున్న యీ చచ్చిపోవుట కూడ నన్నేమియు చేయలేదు. ఇట్లు విచారణచేత తప్ప మఱొకవిధముగా 'నేనెవరో' తెలిసికొనలేము. ఈవిధముగా నిష్పక్ష పాతముగా, నిరభిమానముగ, నిస్సంకోచముగా తన్నుతాను తెలిసి కొనుటకై కావలసిన చిత్తశుద్ధిని, ఏకాగ్రతను సంపాదించుటకే తప స్స్వాధ్యాయములు సాధనము లగుచున్నవి. తపస్సుచేతనే ప్రశ్నవేయు టకు, పిప విచారణచేయుటకు సామర్థ్యము కలుగును. సర్వ విశ్వ మందున్న శక్తియే యిట్టి తపస్సంపన్నునియందు విచారణరూపమున పరిణమించును.

ఇది సకల తపసులయందు శ్రేష్ఠము. ఇహలోక పరలోక భోగ ములయందు ఐశ్వర్యములయందు విరక్తులై ఆత్మతత్త్వ నిరతులగు మహాత్ములు కావించు తపస్సు ఎట్లుండునో కాళిదాసమహాకవి అభిజ్ఞాన శాకుంతలమున చక్కఁగా వర్ణించినాఁడు. "ఇతర మునులు తపస్సులచేత ఏపదార్థములను కోరుచున్నారో అట్టి మహాపదార్థములు సమృద్ధిగా నున్నచోట వీరు తపస్సు చేయుచున్నారు. కల్పవృక్షములతోనిండిన వనమున వీరు ప్రాణధారణకై వాయువునే ఆహారముగా స్వీకరించు చున్నారు; బంగారుపద్మములయొక్క రేణువులచేత ప్రకాశించుచున్న జలములందు వ్రతనియమములకై స్నానములు చేయుచున్నారు; రత్న శిలాతలములందు కూర్చుండి ధ్యానము చేయుచున్నారు; దేవతాస్త్రీల సన్నిధియందు సంయమము నవలంబించుచున్నారు."

శ్లో॥ ప్రాణానా మనిలేన వృత్తి రుచితా సత్కల్పవృక్షే వనే
యే కాంచనపద్మరేణుకపిశే ర్మాభిషేకక్రియా ।
ధ్యానం రత్నశిలాతలేషు విబుధస్త్రీసన్నిధౌ సంయమో
యత్కాంక్షంతి తపోభి రన్యమునయ స్తస్మిం స్తపస్యన్త్యమీ॥

(అభిజ్ఞాన శాకుంతలము-7 అంక - శ్లో. 12)

సామాన్యులు స్వ భోగములకై తపస్సుచేయుదురు. ఆత్మజ్ఞాన నిరతు లైన మహర్షులు అట్టి భోగప్రదములైన కల్ప వృక్షములు, చింతామణి, అప్సరసలు లభించినప్పుడు ఆ పదా ములను కూడ అనిత్యములనుగా గుర్తించి, వానిచే ఆకర్షింప బడక నిత మైన యాత్మతత్త్వము కొఱకే తపస్సు చేయుచుందురు. కావున సకల లోకములలోని భోగములయందు ఐశ్వర ములయందు విర క్తి కలిగిననేకాని ఆత్మతత్త విచారణ రూప మైన స్సు కొనసాగదు.

మనము జీవితమును విమర్శించి చూచుటకు ఆరంభించినచో పరలోక సౌఖ్యములను కూడ అనిత ములనుగా గుర్తింపఁగలము. కలను గూర్చి నిశితముగ ఆలోచించినచో అది మఱియొక జన్మవంటిదేయని గ్రహింపగలము. కల జరుగుచున్న సమయమున ఈ లోకమునుగూర్చి యీ దేహమునుగూర్చి యిప్పుడు మనకున్న జ్ఞానముండదు. అది ఏ లోకములోనో జన్మాంతరములోనో జరిగినట్లే యుండును. కలలోని సుఖమునకు పరలోకసుఖమునకు వాస్తవముగా భేదమేమున్నది. కల అల్పకాలికమైనచో, పరలోకానుభవము అధికకాలిక మగును. ంత మాత్రమే భేదము ఎట్లయినను రెండును అనిత్యములే. మఱి నిత సుఖ మును సంపాదించుటకై ప్రయత్నించుటేకదా ప్రాజ్ఞత. కావుననే మహాభక్తులు, జ్ఞానులు, "బంగారమును కూడఁబెట్టుటయందుఁగాని, కామోపభోగములయందుఁగాని, పరలోకభోగసాధనమైన ధర్మము నందుఁగాని మాకు కోరికలేదు" అనియే చెప్పుచున్నారు.

శ్లో॥ నాస్థా ధర్మే నవసునిచయే నైవకామోపభోగే
ముకుందమాల 7 శ్లోకం

ఈ సంసారము అనిత్యమని దీనిని ఒక నాటకమువలె మనము చూచుచుండవలెనని యెందరు ఎన్ని విధముల చెప్పుచున్నను మనకు యథార్థముగా ఈ సంసారమునందు విరక్తి కలుగుటలేదు. అది యంత సులభమైనదికాదు. ధృతరాష్ట్రుఁడు మనకు తగిన ప్రతినిధి. ధృతరాష్ట్రుఁ డనగా సంసార రాష్ట్రమును దరించిన వాఁడన్నమాట. అతడు తనకు కుమారులమీఁద ప్రేమ తొలగిపోవుటలేదని, వారివలన కలుగు దుఃఖము తనకు సంభవింపకుండుటకు ఉపాయము నుపదేశింపుమని సనత్సుజాతుని ప్రార్థించినాఁడు. అప్పుడు ఆ మహర్షి యిట్లు చెప్పినాడు. "ఓ రాజా మిక్కిలియాసక్తితో నీవు దేనినిగూర్చి యడుగుచున్నావో ఆ బ్రహ్మము త్వరపడుచున్న వానికి లభింపదు. దృఢమైన ధ్యానముచే సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు నిశ్చయాత్మకమైన బుద్ధియందు లీనమగు నపుడు ఆ బ్రహ్మవిద్య బ్రహ్మచర్యము చేత లభ్యమగును."

శ్లో॥ నైతద్బ్రహ్మ త్వరమాణేన లబ్ధం
యన్మాంపృచ్ఛ స్యభిష ఙ్గ రాజన్।
బుద్ధౌప్రలీనే మనసి ప్ర చిన్త్యా
విద్యా హి సా బ్రహ్మచర్యేణ లభ్యా॥

సత్సుజాతీయము

బ్రహ్మచర్య మనఁగా ఆచార్యుని గర మున అనఁగా ఆయన శుశ్రూషయందు, ప్రవేశించి బ్రహ్మమునంద చరించుట, అనఁగా బ్రహ్మమును గూర్చియే చింతించుచుండుట. అట్లు గురు శుశ్రూషచేసి బ్రహ్మజ్ఞుఁడైనవాఁడు మరల జన్మించిన వానితో సమానుఁడే. అనఁగా సంసారిగా చచ్చిపోయి బ్రహ్మజ్ఞుఁడుగా మరల జన్మించినాఁ డన్న మాట. తల్లిదండ్రులవలనఁ గలిగి జన్మముకన్న ఆచార్యుని వలనఁ గలుగు ఈజన్మమే ఉత్కృష్టమైనది; అమోఘమైనది.

నిపుణుఁడైన వానియొద్దకు పోయి యడుగుచున్నాము. ఇతరుల నడిగి ప్రయోజనము లేదుకదా! అట్లే మనకు బ్రహ్మమునుగూర్చిన జ్ఞానము కావలసినచో ఆశాస్త్రమును నియమపూర్వకముగా అధ్యయనము చేసి అందు కృతార్థుఁడైనవానినే అడుగవలె. బ్రహ్మమునుగూర్చి యెచ్చట చెప్పఁబడినది? వేదశిరసులైన యుపనిషత్తులయందు చెప్పఁబడినది. కావున ఆ శాస్త్రమును యమపూర్వకముగా అధ యనము చేసిన వాఁడే దానినిగూర్చి చెప్పఁగలఁడు. ఇతరుల నడిగి చో వృథాకాల యాపనమే కాక అపసిద్ధాంతములను వినుటకూడ తట ంచును. వేద శాస్త్రములను వదలి, వానికి విరుద్ధముగా "ఇది మాయనుభవము; మీరు వినుఁడు" అని యెవరైన చెప్పఁబూనినచో అతఁడు చెప్పునది విననక్కఱలేదు. అతనికి నిజముగా తత్త్వానుభవము కలిగినదని మన కేమి ప్రమాణమున్నది? ఒక్కొక్కనికి ఈదినమున్న యనుభవము మఱునాటి కుండదు. కావున శాస్త్రమునను సరించి బోధి మువాఁడే గురువు.

ఆత్మ అనఁగా ఏమో తెలియకపోయినచో దానినిగూర్చి విచా రించవలె. "నాసంగతి నాకు తెలియదా? ఎందుకు తెలియుటలేదు? నాకు తెలియకపోవుట యేమిటి?" అనుప్రశ్నలతో అలోచించుట మొదలుపెటవలె. శ్రోత్రియుఁడైన బ్రహ నిష్ఠుని ఆశ్రయించి విధే యతతో ంశయముల నడుగుచు విచా ణచేయుచు తత్త్వమును గ్రహించవలె.

## 9) సమన్వయదృష్టి

ఈకాలమునఁ గూడ నిష్పక్షపాతముగా విచారణచేయఁగలిగిన వారు లేకపోలేదు. ఏ పరమేశ్వరుఁడు శంకరభగవత్పాదులుగా అవత రించెనో ఆ పరమేశ్వరుఁడు భగవద్రామానుజులుగా జన్మించెన తిరుపతిలో వరదాచార్యులుగారను పండితుఁ డున్నాఁడు. ఇది ఆశ్చ కరమే. ఇట్టి సామరస్యదృష్టి యున్నచో వేదములయ ము చ క్కఁగా తెలియఁగలదు. ఆయన తనయభిప్రాయము నిట్లు వివరించినాఁడు.

“శూన్యమే తత్త్వమని బౌద్ధులు వాదించుచుండఁగా శంకరులవారు వారి వాదమును ఖండించి “సత్” పదార్థమే తత్త్వమని నిరూపించినారు. పిదప నాస్తికులు “శరీరమే నేను” ఇంతకు మించిన “ఆత్మ యనునది వేఱొకటి లేదు” అని దేహాత్మ వాదమును చేయుచుండఁగా ఆ దేవుఁడే రామానుజులవారుగా అవతరించి, శరీరమనఁగా ఒక వ్యక్తి యొక్క శరీరము మాత్రమే కాదని, సర్వ శరీరములకు ఆధారమైన ప్రకృతి భగవంతుని శరీరమే అని, ఎల్ల శరీరధారులలో “నేను” అని స్ఫురించుచున్న చైతన్యము భగవత్స్వరూపమే యని నిరూపించినారు.’ అని వరదాచార్యులవారు సమన్వయించినారు. కాని ఆ పరమేశ్వరుఁడే మధ్వాచార్యులవారుగాకూడ అవతరించెనని చెప్పలేము, అని ఆచార్యులవారి సహగఁగా వారు ఇట్లనిరి. “మధ్వాచార్యులవారిని వాయుదేవుని యవతారముగా మాధ్వులు చెప్పుదురు. వాయుదేవుఁడు పరమేశ్వరుఁడు కాదు.” కనుక మధ్వాచార్యులవారు పరమేశ్వరుని యవతారముకాదు.”. అప్పుడు, “సర్వం ఖల్విదం బ్రహ్మ” అను వాక్యముచేత వాయుదేవుఁడుకూడ పరమేశ్వరుఁడే యని అన్వయింపరాదా అని ప్రశ్నింపగా, “అట్లన్నచో అద్వైతమే సిద్ధించును. అందులకు ద్వైతులు ఒప్పుకొందురా?” అని ఆయన సెలవిచ్చెను. అన్నిటిని సమన్వయించుట సులభమైనపనికాదు. కొందరు కొంతవరకే వెళ్ళగలరు. ఇప్పుడన్నిమతములు ఒకటే చెప్పుచున్నవని పిచ్చి సమన్వయము చేయుచున్నారు.

## 10 ప్రశ్నించుట

విచారణ చేయునప్పుడు నిశితముగ ఆలోచించుచు నిస్సంకోచముగా ప్రశ్నింపవలసినదే. జిజ్ఞాస అనగా తత్త్వము నెఱుంగవలయునను కోరిక, కూడ భక్తియే. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞానియని భక్తులు నాలుగు విధములుగా నుందురు. జిజ్ఞాసువైన భక్తుఁడు భగవంతుఁడు ప్రత్యక్షమైనచో తత్త్వమునుగూర్చియే ప్రశ్నించును. అట్టిజిజ్ఞాసువు విష్ణులోకమునకు వెళ్ళినప్పుడు ఆ మహావిష్ణువును, “నీవు యిట్లు నిత్యము

ఆనందస్వరూపుడవుగా నుండఁగా ఈ జీవులు సంసారములోఁబడి ఎల్లప్పుడు ఈలాగుననే దుఃఖించుచుండవలెనా? వీరి గతియేమి?' అని యడిగినచో ఆయన "ఇది నిజముకాదు; ఇది యంతయు నా లీల" యన్నచో ఆ జిజ్ఞాసువు ఊరకుండునా ?" నీకు లీలయైనచో మంచిదే; మాకు ప్రాణసంకటముగా నున్నది. మాకీ సంకటము తప్పుట యెట్లు?" అని యడుగకుండునా అప్పుడా దేవుఁడు "నేనే నీవుగా, జీవులుగానయి వినోదించుచున్నాను. నీవు వేరు కాదు. నేనే నీకు తరువాత చెప్పెదను అప్పుడు నీవును నేనేయని యిది నీకును లీలయని తెలియును." అని యలతిరీతిన చెప్పవలెనే కాని, "నేను ఈశ్వరుఁడను గనుక ఆనంద స్వరూపుఁడనే; నీవు జీవుఁడవు గనుక నీ గతి యింతే అని చెప్పి సమాధాన పఱచఁగలడా ? ఈ జగత్తు దేవునికి మాత్రమే గాక మనకును లీలగా తోఁచిననే తప్ప దుఃఖమయమైన యీ సంసారమును వదలిపోదు.

పరమేశ్వరుఁడు భక్తవత్సలుఁడు కావున జంకు లేకుండ ఏవిషయమైనను అడుగవచ్చును. పరమేష్ఠిని నారదుఁడు నేరుగా ఇట్లు ప్రశ్నించినాఁడు.

శా॥ నాకుం జూడఁగ నీవు రాజవనుచున్నాఁడన్ యథార్థస్థితిన్
నీకంటెన్ ఘనుఁడొక్క రాజు గలఁడో నీ వంతకున్ రాజవో
నీ కేలాభము రాఁదలంచి జగముల్ నిర్మించె దీచేతనా
నీకం బెందు జనించు నుండు నడఁగున్ నిక్కంబు భాషింపుమా॥

భాగవత స్కంధ 2-ప. 75

శా॥ అంభోజాసన ! నీకు నీశుఁడు గలండంచుం జేసితిఁ దత్ప్రకమం
దంభోజాతభవాండ మేవిభుని లీలాపాంగ సంయుక్తిచే
సంభూతంబగు వర్తమానమగు సంభవ్యంబగుం దదఖిలన్
సంభాషింపఁగ వచ్చునే, తలఁప నే చందంబు వాఁడాత్మ న॥

[భాగవత-స్కంధ 2-ప. 77

అప్పుడా పరమేష్ఠి ఈ ప్రశ్నలకు సంతోషించి యిట్లు నారదుని మెచ్చుకొన్నాఁడు.

కం॥ రారా బుధులు విరక్తులు, గారా యీరీతి నడుగఁగా నేరరు వి
స్మేరావహము భవన్మత, మౌరా !నావిభునిమర్మమడిగితి వత్సా!
[భాగవత-స్కంధ 2-ప. 80

పై విధముగా మనము దేవుని అడిగినచో ఆయన, "నాకును నీకును వాస్తవముగా భేదములేదు; చక్కఁగా తెలిసికొన్నచో నీకుఁ గూడ ఈ సృష్టియంతయు లీలగానే తోఁచును" అనియేగదా సమాధానము చెప్పునని వరదాచార్యులవారితో ననఁగా ఆయన నిజమేయని అంగీకరించెను.

మనకు దేవునియెడలఁగల స్వాతంత్ర్యము, ప్రేమ ఇతర మతములలో అంతగా కన్పింపదు. మన హిందూమతములో భక్తులు దేవుని "రావేమిరా ! నా బాధల నివారింపవేమిరా" అని మిత్రునో, అన్ననో పిలిచినట్లు ప్రార్థించుచుందురు. ఇతర మతములలో దేవుని ఇట్లు సంబోధించుట, ప్రశ్నించుట కన్పింపదు. దేవుడు తండ్రి, కరుణామయుడు అని చెప్పినను వారాయనను జూచి భయపడెదరు. కొడుకులనుగూడ ఆయన శాశ్వతమైన మండుటగ్నిలోఁబడవేయునని చెప్పెదరుకదా ! తండ్రి కుమారుని శిక్షించినను అతని మేలుకొఱకే కాని ద్వేషముతో కాదు. దేవుడు కరుణామయుడు సర్వశక్తిమంతుడు అని చెప్పుచు తన కుమారులనే శాశ్వత భయంకరాగ్నిలో గాల్చునట కుదరదు. "నేను శివుఁడ"నని ఏ భక్తుఁడయిన అనఁచో వానిని తన్నుగానే శివుఁడు భావించునుగాని కోపింపఁడు. లోకములో ఒక రాజ్యములోనివారుఁడు ఆ రాజు దగ్గఱకుపోయి "నేనే రాజును" అన్నచో, వెంటనే వాని తల తీసివేసి శిక్షించును గాని మన్నింపఁడు. మఱిలోకనాయకుడైన శివుఁడు మాత్రము అట్లు చేయఁడని శివగీతలలో ఉన్నది.

## 11. విచారణకష్టము

జగత్తు, జీవుఁడు, ఈశ్వరుఁడు అను విషయములలో తత్త్వనుమువిచారించునప్పుడు యెట్టి సంకోచములేకుండ ఆలోచింపవల

# వ్యవహారము

మనము విశేష మును (Substantive) విశేషణముగాను Adjective విశేషణమును విశేష మునుగాను గ్రహించుచున్నాము. "ఈ పండు ఉన్నది" అనువాక్యము నందు ఉనికియే అసలు విశేష్యము (Substantive) పండు తనము దానికి విశేషణము (Adjective), పతివానికి తానేలాగైన ఉండవలయునని యున్నది: ఏదో ను కావలయునని (To become great, rich Etc) కూడ ఉన్నది. గొప్ప వాఁడుగా నున్న కొద్ది వాఁడుగా నున్నను తానెట్లయిన ఉన్నవాఁడే కదా! తాను గొప్ప వాఁడుగానైనది, సంపన్నుఁడుగానైనది, ఇట్లు అయిన వన్నియు పోవుచునే యున్నవి కదా! ఇవి యెన్ని వచ్చినను పోయినను తాను ఉండనే ఉన్నాఁడు కదా! ఇంక మఱి తాను ఏదో కావలయునను తపన యెందులకు? తనకు సుఖము కావలయునన్నచో తానేదో యొకటి యైననే తప్ప ఆ సుఖమురాదని యున్నది. ఏది వచ్చినను ఏది పోయినను కలుగుచున్న సుఖమంతయు నేను నాయందే అనుభవించుచున్నాను అను నెఱుక మాత్రము కలుగుటలేదు.

"ఇది కాయి, ఇది ఆకు, ఇది పండు" అని చెప్పుచున్నాము. "ఇది" అంటే యేమిటి? కాయి, ఆకు, పండు మొదలుగా ఏది మాఱినను "ఇది" మాఱుటలేదు. అనఁగా "ఇది" అన్నది ప్రధానమై, విశేష్యమై, మాఱుచున్న కాయి, ఆకు పండు మొదలైనవి అప్రధానములై దానికి విశేషణములగుచున్న వన్నమాట. "నేను సుబ్బారావుగా ఉన్నాను" అన్నప్పుడు నేను సుబ్బారావునా? ఉన్నవాఁడనా? ఇప్పుడు సుబ్బారావు నైనమాట నిజమే, కాని ఎప్పుడును సుబ్బారావునుగానే యున్నానా? పేరు పెట్టిన తరువాతఁగదా సుబ్బారావునైనాను. పేరు పెట్టక పూర్వము నేనున్నానుగదా! అప్పుడు నన్నెట్లు పిల్చినారు? చిటికలు వేయుచు పిల్చినారు? పేరుతో సంబంధములేనప్పుడు అందఱకు, "నేను, నీవు, వాఁడు" అను సర్వనామములే (Pronouns) పేళ్ళు సుబ్బారావు, రామారావు మొదలైన పేళ్ళు "నేను, నీవు" అనువానికి

ఆదులుగా వచ్చినవి. సర్వనామములనఁగా అందఱికును వాడఁదగిన నామ వాచకములన్న మాట. "నేను, నీవు" అనుపదములకు మగ,ఆడు భేదము లేదు.

సంసారములో జరుగుచున్న పనులన్నింటికి మొదలు "నేను" గదా! అన్ని సంకల్పములకు మొదలు "నేనే" "నేను కర్తను" అని తెలిసిననే తప్ప సరియైన విచారణ జరుగదు. అనుక్షణము మనము చేయుచున్న పనులను, మన సంకల్పములను, భావములను మనము చూచుచుండవలె! ఈ విచారణ చాల కష్టము.ఎవరికి? దేహాభిమానము కలవారికి. కోరిక కలిగినప్పుడు దానిని అనుభవించిననే కాని యది కరదు. కోరికలు పుట్టకుండ పోయినప్పుడు గాని మనస్సు నిర్మలము కాదు. ఇందువలన ఈ జన్మలో ఏవియనుభవించుటకు వీలుకాలేదో అట్టి సంపదలు కలుగుటకై పై జన్మను కోరుకోవలెను. దురాసోమ హార్షియంతవాఁడు తనకు ఫలాని జన్మము కావలెయునని కోరుకొన్నాఁడు. మనము కోరుకొనునప్పుడు కూడ ఉదారముగా కోరుకొనము. కాని యెట్టి జన్మలోనైన ఏదో విధముగా సుఖముగా నుండవలెనని మాత్రము కోరుకొను చుందుము. అనఁగా మొత్తము మీఁద ప్రీతియంతయు "నా" మీఁదనే "నా" కొఱకే సర్వము ప్రియమగుచున్నది. "నా"కు ఏది ప్రతికూలమో అది "నా"కు ప్రియముకాదు. సకల వస్తువులందును నాకు కలుగుచున్న ప్రీతికి మూలము "నేనే" కావుననే వేదము "నేను" అన్నది యెట్టి వస్తువో తెలిసికొమ్మని చెప్పుచున్నది. యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయికి ఇట్లు చెప్పినాఁడు. "ఆత్మను చూడవలయును, వినవలయును ఆలోచింపవలయును, ధ్యానింపవలయును" - (బృహదారణ్యక - అధ్యాయ-4-బ్రాహ్మణ-4-మంత్రము-5)

"ఆత్మవా అరే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః"
"ఆత్మకొఱకే సర్వమును ప్రియమగుచున్నది" (బృహదా-
అధ్యా -4-బ్రాహ్మణ-4-
"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియంభవతి (మంత్ర-5)

నాకు తరువాత దుఃఖమును కలిగింపవచ్చు; లేదా వారు అశక్తులై నన్నే మియు చేయలేక దుఃఖ పడుచున్నను నాకు కూడా కొంత పరితాపము కలుగక తప్పదు. కాబట్టి మంచివృత్తి అనగా నాకేగాక యితరులకు కూడ సుఖమును కలిగించునదిగా నుండవలె.

అన్నివృత్తులకన్న అత్యంతము బలము కలిగినవృత్తి ఆకలి. ఇది పుట్టగానే ఆహారము సంపాదించుకోవలెనను పూనిక ఆపుకొనుటకు వీలులేనంత తీవ్రముగా బయలుదేరును. ఆకలి తీరవలెనన్నచో అన్నమును సంపాదించుకోవలసినదే. మఱి జీవహింస లేకుండ అన్నమును సంపాదించుకోగలమా ? ప్రపంచములో నూటికి 90 మంది మాంసాహారులే కదా ! హింసకన్న చెడువృత్తి యేమున్నది ? శాకాహారులైనను హింసయే లేకుండా అన్నమును సంపాదించుకొనగలరా ? కూరలు కాయలు, పండ్లు, దుంపలు మొదలగువాని నిచ్చునట్టి వృక్షములకు తీగలకు కూడ ప్రాణమున్నదికదా ! వానినుండి కాయలను పండ్లను ఆకులను కోసి తెచ్చినచో ఆ వృక్షములకు తీగలకు హింస కలుగదా ? మనము కూరలు తఱుగునప్పుడు, నిప్పుచేయునప్పుడు, వండునప్పుడు నీరు త్రావునప్పుడు, గాలి పీల్చునప్పుడు ఎన్నో సూక్ష్మజీవులు చచ్చిపోవుచున్నవి గదా ! అది హింస కాదా ! నీరు, నేల, ఆకాశము, గాలి అంతయు జీవమయము. మనము కదలినను మెదలినను జీవహింస తప్పదు. హింస చేయకుండ ఎవడును క్షణముకూడా బ్రతుకలేడు. మఱి ఈ హింసావృత్తిని తప్పించుకొనుటయెట్లు ? సాధ్యమైనంతవఱకు మనము బుద్ధిపూర్వకముగా ఇతర ప్రాణికి దుఃఖము కలుగకుండునట్లుగా వర్తించుచుండుటయే యిందులకు మార్గము.

ఈ మార్గమును మనకు చూపగలిగినది శాస్త్రమొక్కటే. శాస్త్రమనగా ఉత్తమమైన యాలోచనమే (Higher reasoning) పిల్లవానికి విద్యాభ్యాసము గావించునప్పుడు వానికి ఏది మేలైన విధానమో దాని మము ఆలోచించి నిశ్చయింతుము. మనకు ఏది మేలో నిశ్చయించుటకు మన బుద్ధిచాలదు. మనకన్న పెద్దవారు మనకేది మేలో ఆలోచించి నిశ్చయించవలె. సకల ప్రాణులకు సృష్టికర్తయైన పరమేశ్వ

రుఁడే ఈ ప్రాణులకు ఏది హితమో సర్వోత్తమముగా ఆలోచించి చెప్పఁగలిగినవాఁడు. కావుననే ఆయనయొక్క ఆజ్ఞారూపములైన వేదములు, వానిననుసరించి రచింపఁబడిన స్మృతులే మనకు ధర్మవృత్తియందు ప్రమాణములు. మన వలన జీవహింస జరుగుచున్నప్పటికీ, హింసింపఁబడుచున్న ప్రాణికి మేలుకలుగునట్లు, మనకు చెడువృత్తి కలుగకుండునట్లు శాస్త్రము చేయఁగలదు. ఒక ప్రాణిని చంపునప్పుడు ఆ ప్రాణికి, అప్పుడున్న స్థితికన్న మహత్తరమైన స్థితిని కలిగింపఁగలిగినచో ఆ ప్రాణికి దానివలన మేలే కలుగుచున్నది కావున అది హింస కాదు. తప్పు చేసిన వానిని శిక్షించుట, రోగికి శస్త్రచికిత్స చేయుట హింస కాదుగదా! అట్లే మన యాహారము కొఱకు ఒక ప్రాణిని చంపవలసి వచ్చినప్పుడు కూడా, ఆ ప్రాణికి మహత్తరస్థితి కలుగునట్లుగా చేయఁగలిగినట్లయిన, ఆ హింస వలన పాపము రాదు. మనము ఆహారముగా స్వీకరింపఁదలఁచిన ప్రాణిని దేవతయొద్ద "బలి" గావించినచో ఆ ప్రాణికి

మరణము వలన తరువాత జన్మలో ఉచ్చస్థితి కలుగును. బలియను మాట క ము పూజ ఎవరైనను తమకేది ఆహారమో దానిని దేవతకు నివేదనము గావించి తరువాత భుజింపవలె. కొందఱు టెంకాయలు కొట్టి నైవేద్యము పెట్టుచుండఁగా మాంసాహారులైన వారు తమ కాహారమైన జంతువులను దేవతలకు బలిగావించి తరువాత భుజింతురు. హింసను నివారింపవలెనను తలంపుతో గ్రామదేవతలకు పశుబలిని నిషేధింపఁగలమే కాని, మాంసాహారుల కొఱకు అనుదినము ప్రతి నగరమున జరుగుచుండు పశువధను నివారింపలేముకదా! మాంసాహారము కొఱకు పశువధను మానుకోలేనప్పుడు ఆ పశువులను దేవతలకు బలిగావించి తరువాత భుజించుట మేలుకదా! మరణ సమయములో ఉపాధివదలఁగానే జీవునకు పూర్వజన్మలయొక్క రాఁబోవు జన్మముయొక్క జ్ఞానము కలుగును. మరణ సమయములో దేవత యొద్ద బలిగావింపఁబడుచున్న జంతువునకు ఆ దేవతను చూచుచు భావించుచుండుటవలన తప్పకుండ మనుజన్మలో మహత్తర తి కలుగును. యజ్ఞములో మేకకు నవరంధ్రములు మూసినప్పుడు దా కి విశేష జ్ఞానము కలుగును. యజ్ఞమనఁగా దేవపూజయే. కావుననే యజ్ఞములోని పశువధ హింస కాదు. ధర్మము

ఇట్లు ఎల్లప్పుడు ఉందు మన్న సంగతి గాని, ఎట్లు ఉందుమను సంగతిగాని పుట్టుటకు పూర్వము, చచ్చిన తరువాత విచారింపలేము. ఇపుడే విచారించవలె. ఇట్లు నేనొక్కడనే యుండుట కాదు, ప్రతి శరీరములోను ప్రతి ప్రాణియు "నేను, నేను" అని చెప్పుచునే యున్నాఁడు. శరీరములు కోట్లకొలఁది భేదములతో నున్నను, అన్ని శరీరములలో స్ఫురించుచున్న "నేను" మాత్ర మొకటే. ఈ "నేను" యొక్క స్వరూప మేమి ? ఈ "నేను" నుగూర్చి శ్రీ కృష్ణ భగవానుఁడు అర్జునునకు ఇట్లు బోధించి నాఁడు." "అర్జునా ! ఈ పరమాత్మ అనాది యగుట వలన, నిర్గుణ మగుట వలనను అవ్యయమైనవి, అనఁగా ఎట్టి మార్పును పొందనిది. కావున ఈ యాత్మ దేహమం దున్నను ఏ పనిని చేయుటలేదు, ఏ కర్మ ఫలమును పొందుట లేదు."

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయ మవ్యయః ।
శరీరస్థోఽపి కౌన్తేయ ! న కరోతి న లిప్యతే ॥

[భగవద్గీత-అధ్యా. 13 శ్లో. 31]

ఇట్టి వాక్యములను గైకొని మనము ఎప్పటికి నశింపని వారమని, ఏ మార్పు నొందని వారమని గ్రహించు చుండుటయే విచారణ. శరీరధారులమైన మనము శరీర మందు స్ఫురించుచున్న మన యాత్మ స్వరూపమునే విచారించి గ్రహింప వలె. ఈ "ఆత్మ" శరీరమందున్నను ఏ పనిని చేయుటలేదు. ఆ పనుల వలన కలుగు ఫలము లను పొందుట లేదు. "మఱి శరీరములందుండి కర్మలను చేయుచు వాని ఫలము లను పొందుచున్నవాఁడెవఁడు ? దేహమందున్నవాఁడు పరమాత్మకన్న భిన్నుఁ డనుటకు వీలులేదు. "క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధి" (శరీరమందున్న యాత్మనుకూడ నన్నుగా నెఱుంగుము) అని భగవంతుఁడు చెప్పియున్నాఁడు కదా ! పరమాత్మ కన్న దేహియైన యాత్మ భిన్నుఁడు కాకున్నచో, మఱి కర్మలు చేయుచు ఫలములు పొందు చున్నవాఁడెవఁడు ? అసలు నిర్గుణుఁడు, అవ్యయుఁడు, అనాదియైన పరమాత్మ ఉన్నాఁడా ? లేఁడా ? ఇట్లు భగవత్ప్రోక్తమైన యౌపనిషదమైన దర్శనము స్పష్ట ముగా తెలిసికొనుటకుఁగాని, ఇతరులకు చెప్పుటకుఁ గాని అసాధ్యమని వైశేషికుల చేత సాంఖ్యులచేత ఆర్హతుల చేత బౌద్ధుల చేత పరిత్యజింపఁబడినది. "స్వభావమే ప్రవర్తించుచున్నది" అని (స్వభావస్తు ప్రవర్తతే) యిచ్చట విరోధమునకు పరిహా రము భగవంతుని చేతనే చెప్పఁబడినది. అవిద్యామాత్రమైన స్వభావమే కర్మలను చేయుచు ఫలములను పొందుచు నున్నది. అందువలన వ్యవహారము జరుగుచున్నది.

అంతేకాని పరమా మున అద్వితీయమైన పరమాత్మయందు ఆ వ్యవహారము లేదు, కావుననే పరమార్థమైన యీ సాంఖ్య దర్శనమునందే నిల్చినవారికి జ్ఞాన నిష్ఠులకు పరమహంస పరివ్రాజకులకు, అవిద్యా వ వహారమును తిరస్కరించిన వారికి, కర్మాధికారము లేదని అచ్చటచ్చట భగవంతుని చెప్పఁబడినది.

"కః పున హేషు కరోతి లిప్యతేచ ? యది తావ దనః పరమాత్మనో దేహీ కరోతి లిప్యతే చ, తత ఇద మనుపపన్నమ్, ఉక్తం క్షేత్ర శ్వరైకత్వం క్షేత్రజ్ఞం చాపిమాం వి ద్యాది। అథ నాస్తీశ్వరా దన్యోదేహీ, కః కరోతి లిప్యతే చేతి వాచ్యం పరో వా నాస్తీతి। సర్వథా దుర్విజ్ఞేయం దుర్వాచ్యం చేతి భగవత్ప్రోక్త మౌపనిషదం దర్శనం పరిత్యక్తం వైశేషికైః సాంఖ్యార్హత బౌద్ధైశ్చ। తత్రాయం పరిహారో భగవతా స్వేనైవోక్తః స్వభావస్తు ప్రవర్తతే ఇతి। అవిద్యామాత్ర స్వభావో హి కరోతి లిప్యతే ఇతి వ్యవహారో భవతి, న తు పరమార్థత ఏకస్మిన్ పరమాత్మని త దస్తి। అత ఏతస్మిన్ పరమార్థసాంఖ్య దర్శనే స్థితానాం జ్ఞాననిష్ఠానాం పరమహంస పరివ్రాజకానాం తిరస్కృతావిద్యావ్యవహారాణాం కర్మాధికారో నాస్తీతి తత్ర తత్ర దర్శితం భగవతా॥ (భగవద్గీత - అధ్యా. 13-శ్లో. 31 - శ్రీ శంకర భాష్యము) కావున జాగరూకతతో సూక్ష్మముగా విచారింపవలె.

## 16. మన యభిప్రాయాలు

మనలను గురించి, ఇతర వి యములను గురించి మనకు ఎన్నో యభిప్రాయము లున్నవి. చచ్చిపోయిన తరువాత మన ముందుమా లేదా Life after death) అన్న విషయమున అనేకులకు అనేక విధములైన యభిప్రాయములున్నవి. అట్లే జ్ఞానము, సన్న్యాసము, మోక్షము అను విషయములలో కూడ మన కేవో కొన్ని యభిప్రాయములున్నవి. ఎటువంటి యభిప్రాయ మున్నను, మనము దాని యందు అభిమానమును తీసివేసికొని, దానిని విచారణలోనికి తీసికొని రావలె. విచారణ అనఁగా మనకున్న యభిప్రాయములను పరీక్షించుకొనుటయే. వాని నట్లే యుంచుకొని ఏ వేదాంత వాక్యమునకో అ మును గ్రహింప వలెనని ఎన్ని సిద్ధాంత రాద్ధాంతములు చేసినను, మన యభిప్రాయములలోని గుణదోషములే ఆ సిద్ధాంత రాద్ధాంతముల లోనికికూడ ప్రవేశించును. అది ప్రామాణ్య బుద్ధితో చేసిన విచారణ కాదు. దానివలన ప్రయోజనము కూడ నుండదు.

సన్న్యసించిన వానికే జ్ఞానము కలుగునని, వానికే మోక్షము కలుగునని మనము అనుకొనుచున్నాము. అట్లే సన్న్యాసికి లోకవ్యవహారమే యుండదనికూడ తలంచు

సర్వనాశ మగునని తోఁచక తప్పదు. ఆ విషయమునుగూర్చి అనుకొనుటయే మనకు ఇష్టముండదు. ఆత్మజ్ఞానమును కోరువాఁడు ఎట్లు ఆలోచింపవలయునో శ్రీకృష్ణ వాముఁడు అర్జునున కిట్లుబోధించినాఁడు. "అర్జునా! సత్త్వ రజస్తమోగుణములం కూడినవారికి, ఆయాగుణముల కనురూపములైన ఫలములను ప్రతిపాదించునవి వేదములు. నీవు త్రిగుణాతీతుఁడవై జయాపజయాది ద్వంద్వములను విడిచి యెప్పుడును సత్త్వగుణ ప్రధానుఁడవై యోగక్షేమములనపేక్షింపక ఆత్మనుగూర్చియే ఆలోచించు చుండుము."

శ్లో॥ "త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥

[ భగవద్గీత-అధ్యా. 2 - శ్లో. 45 ]

కాఁబట్టి, మనము నిత్యమైన యాత్మస్వరూపులము అని తెలిసికొనుటకు కావలసిన చిత్తశుద్ధిని సంపాదించుకొనుటకు తగిన మార్గమును భగవానుఁడు పై శ్లోకములో బోధించినాఁడు.

అసలీ శరీరములో ఒక ఆత్మ ఉన్నదా? ఉన్నచో అది శరీరముకన్న మనకు ఇష్టమైనదా? ఈ శరీరము బోయి మనము ఆత్మగా మిగులుచున్న పక్షమున, ఈ శరీరము పోవుట అనఁగా చచ్చుట, మనకు ఇష్టమా? పెద్ద బాధ కలిగినపుడు, "చచ్చినచో పీడ వదలిపోవును; హాయిగా ఉండును" అని అనుకొందుము. చచ్చిన తరువాత హాయిగా ఉండున దెవరికి? చచ్చిన తరువాత ఎవరుండి యనుభవించెదరు? హాయిగా నుండుట? చచ్చిపోయిన తరువాత తా నెట్లు ఉండును? ఉండకపోయినచో హాయి యెవరికి? "నేను నిత్యుఁడను" అనువాక్యము వినుటవలననే చచ్చిన తరువాత ఉందునా ఉండనా అను సందేహము కలిగినది. అనఁగా సందేహము కలిగినపుడు శ్రుతియే ప్రమాణము.

ఏ ప్రమాణము లేకుండ మనలను గూర్చి మనము తెలిసికొనుట కుదురదు. ఒక గదిలో ఒకఁడు దేనినైన వెదకుట ప్రారంభించినచో ఎప్పటికిని కనఁబడనిది యేది? ఎప్పటికిని ఏ వస్తువైన కనఁబడును గాని, వెదుకుచున్నవాఁడు మాత్రము తనకు కనఁబడఁడు. నాకు తెలియనిది ఏది? నేనే. అనఁగా నన్ను నేను ఎఱుఁగను ( I do not know myself ) ఈ వాక్యము సకర్మకము. సకర్మక

క్రియగల వాక్యములో కర్త, కర్మ ఒకటిగా నుండదు. కాని యీ వాక్యములో "ఎఱుఁగుట" అను ధాతువునకు కర్త, కర్మ కూడ నేనే. ఈవిధముగా, "నేనెవఁడను" అని విచారించునప్పుడు, ఈ శరీరమునందున్న నా సంగతియే కాక, అన్ని శరీరములందున్న "నేను" (Self) అను దానినుగూర్చి కూడ విచారించుచున్నాను. అట్లు విచారించు నప్పుడు ఈ శరీరమునందు ఉన్న "నేను", తక్కిన యన్ని శరీరములందు ఉన్న "నేను" లు ఒకటే అని తెలును.

శాస్త్రజ్ఞుడు (Scientist) ఒక వస్తువుయొక్క తత్త్వమునుగూర్చి నిశితముగా నిష్పాక్షికముగా ఎట్లు పరిశీలించునో అట్లే "నిన్ను" గూర్చి నీవు పరిశీలింపవలె. ఒక వస్తువుయొక్క తత్త్వము తెలిసికోవలె నని తలంచినప్పుడు శాస్త్రజ్ఞుఁడు ఆ వస్తువు వివిధ పరిస్థితులలో ఎట్లు వర్తించునో గుర్తించుచు, దాని యసలు రూప మిదియని తుదకు నిర్ధారణ చేయును. అట్లే నీవును వివిధ పరిస్థితులలో ఎట్లు వర్తించుచున్నావో గుర్తించుచు నీ యథార్థ తత్త్వమును తెలిసికోవలయును. వివిధ దశలలో అనఁగా బాల్యము, యౌవనము మొదలగు దశలలో. వివిధావస్థలలో, అనఁగా జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అనువానిలో నీవు ఎట్లు వర్తించు చుందువో చూచుకొనవలె. ఇందులో ముఖ్యముగా జాగ్రత్తును గుఱించి, మృత్యువును గుఱించి గురువునొద్ద విచారణ చేయవలె. అట్లుగాక స్వబుద్ధితో విచారించినచో పొరపాటు పడుటకు అవకాశ ముండును. కేవలమైన బుద్ధితో ఆలోచించునప్పుడు ఆత్మను తెలిసికొన్నవానికి కోరికలే యుండవని మనకు తోఁచును. ఈ యూహ సరియైనదేనా? మఱి బ్రహ్మవేత్తయైన యాజ్ఞవల్క్యుఁడు "మేము గోవులను కోరుచున్నాము" (గోకామావయమ్) అని చెప్పినాఁడు గదా! ఆయనకు బ్రహ్మజ్ఞానము లేదన వచ్చునా? కావున ఆత్మ విచారణ చేయునప్పుడు శాస్త్రప్రమాణము ననుసరించి గురువునొద్ద విచారణ చేయవలె.

శాస్త్రప్రమాణము వదలి ఎవని యనుభవమును ప్రమాణముకాదు. ఎవఁడు గాఢముగా దేనిని యథార్థమైన తత్త్వమని తలంచుచుండునో వాని కదియే ఆత్మ సాక్షాత్కారముగా గోచరించును. కన్ను రూపమును తెలిసికొనుటకు ప్రమాణమైనట్లు, ఈ సాక్షాత్కారముకూడ తత్త్వమును తెలిసికొనుటకు ప్రమాణమైనచో, కంటితో రూపమును అందఱు సమానముగా తెలిసికొనుచున్నట్లు. సాక్షాత్కారమును పొందిన వారందఱు ఆత్మతత్త్వమును సమానముగా తెలిసికొనియుండవలె. కాని ఒకనికి

యి ప్రాప్తికి, అనిష్ట నివృత్తికి ఉపాయములను వేదము చెప్పుచున్నది, పూర్వజన్మలలోని కర్మలఫలములవలన మనకిప్పుడు ధర్మాధర్మ సంకల్పములుకలుగుచున్నవి. వేద విహితములైన ధర్మముల వలన పుణ్యము కలుగునని యెవఁడు నమ్మఁడో వాఁడు నాస్తికుఁడు. కాఁబట్టి వైదిక మార్గములోనికి వచ్చిననే తప్ప మనయొక్క పూర్వాపరములు తెలిసికొను జ్ఞానము సంపాదించుటకు వీలులేదు. అవైదికముగా ఎంత విచారించినను, అదియంతయు మన యూహగానే మిగిలి పోవును. ఈ యూహలకు అహంకారమే ఆధారము. అహంకారమనఁగా, నాకు తెలిసినది అని యనుకొనుటే తప్ప; "ఇంతకు ముందు తెలియలేదు; ఇప్పుడు ఇట్లు అనుకొను చున్నాను: రేపటికి ఎట్లు తోఁచునో" అని గుర్తింపక పోవుటయే. ఆత్మ ప్రత్యక్షము, అనుమేయము కాదు గనుక, దానిని తెలిసికొనుటకు అహంకారముపై ఆధారపడిన మన యూహలు ప్రమాణము కాదు! వేదమే ప్రమాణము.

వెనుక మనము ఎట్లు ఉన్నామన్న సంగతి విచారింప కుండఁగనే ఇకముందు నిత్యముగా ఉండవలెనని కోరుచుందుము. నిత్యముగా ఉండుట అనఁగా నేమి అని విచారింపము. నిత్యమనఁగా భూతభవిష్యద్వర్తమానములలో ఉండునది గదా! ఏ మతములోను మనకు పుట్టుకకు పూర్వము ఉందుమని చెప్పఁబడలేదు. వేదము నందు మాత్రమే మనము నిత్యులమని, అనఁగా పుట్టుకకు పూర్వము ఉన్నామని, చావునకు తరువాత ఉందుమని, ఘంటాపథముగ చెప్పఁబడి యున్నది. ఇట్లు ఆత్మ వేదవాక్యైక గమ్యము కాఁబట్టి, ఆత్మను గూర్చి అనూహానముగ వేదశాస్త్ర రహస్యముల నెఱింగిన గురువుల యొద్దనే విచారించి తెలిసికోవలె.

## 19. అనుభవించుట

ఇంత మహావిచారణ చేయుటకు మన దేహేంద్రియములయందు, వానిపై మనకుఁగల మోహమందును నిరసన భావము వచ్చుటకు ఎంతో ధీరత్వము కావలసి యున్నది. కావుననే "ఒకానొక ధీరుఁడు ప్రత్యగాత్మను చూచుచున్నాఁడు" (కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్ - కఠ. అధ్యా 2 - వల్లీ 4 - మంత్రము-1) అని వేదము చెప్పుచున్నది. పరిశీలించినచో దేహమే నరకము. దేహము లేని

యెడల నరకము మాత్రము ఏమి చేయును, నరకములోకూడ ఇప్పటికంటె ఎక్కువ బాధలు పొందఁదగిన యాతనా శరీరమును కలిగి యుందుము. ఏదైన శరీరమైనను మనకు దానియందుండు తాదాత్మ్యము సామాన్యము కాదు. ఈ దేహ తాదాత్మ్యమును వదలినఁగాని (Detachment) విచారణ సాగదు. విచార పరుఁడైనవాఁడు ఆహారాదులను అముఖ్యములనుగా (Secondary) గ్రహింప వలె. ఎంతవరకు సంసారములో సులభముగా పనిచేయుటకు వీలుండునో అంతవరకే కర్తవ్యములను తీర్చుకొనుచు, క్రొత్త సంకల్పములు లేకుండ, సాధ్యమైనంత వరకు వ్యవహారమును తగ్గించుకొని ఎక్కువ కాలము ఆత్మవిచారణకు వినియోగింప వలె.

వ్యవహారమంతయు ఇతరులతో సంబంధించినదే యుండును. అందుచే ఇతరులను గూర్చియే ఎక్కువగా ఆలోచించు చుందువు: నిన్ను గూర్చి యాలోచించుకొనుటకు అవకాశ ముండదు. సుఖమో దుఃఖమో కలుగు వరకు ఇతరులతో సంబంధ ముండును. అనుభవము మాత్రము ఇతరులతో సంబంధింపదు. సుఖమో దుఃఖమో నీ యనుభవమును నీవే యనుభవింప వలె. పదిమందిలో కూర్చుండి భుజించు నప్పుడు, ఇష్టమైన కూరవలన సుఖమో, ఇష్టము కాని దానివలన దుఃఖమో నీవే యనుభవింతువు. ఇతరులకు దానితో సంబంధము లేదు. కావున ఎప్పుడైనను నీ యనుభవము నీదే యైనప్పుడు ప్రపంచముతో నీకేమి పని ? నీ వనుభవించుచున్న సుఖదుఃఖముల సంగతిని వెంటనే పరుగెత్తుకొని పెళ్ళి యితరులతో చెప్పుకొనుచున్నావు. అందువలన నీ యనుభవముతో వారికేదో సంబంధమున్నట్లు తలంచుచున్నావు. కాని అనుభవ సమయమునందే నీ వొక్కఁడవే యనుభవించు చున్నావని గుర్తించు కొనుము. మృత్యువులో కూడ ఒకఁడే చచ్చు చున్నాఁడు: ఎవనికి వాఁడే ఆ యనుభవమును పొందు చున్నాఁడు.

సుఖము గాని దుఃఖముగాని నీ వొక్కఁడవే యనుభవించుచున్నట్లు తెలిసికొన్నచో, ఈ సుఖ మెక్కడ నున్నది. ఈ దుఃఖ మెక్కడ నున్నది: ఇవి యెక్కడ నుండి కలుగు చున్నవి, అను ప్రశ్నలు పుట్టును. మనము దేనిని అనుభవించు చున్నాము ? తృప్తి అనఁగా నేమి ? నీ కొక వస్తువు కావలయుననఁగా అది నీకు ఇష్టమన్నమాట. ఇష్ట మున్నచోటనే సుఖ మున్నది. ఇష్టము లేకపోయినచో సుఖము లేదు. వస్తువుయొక్క గుణము లేక లక్షణము ఎప్పుడును ఒకటిగానే యుండును.

వస్తువునందే సుఖమున్నచో, ఆ వస్తువు నెవరనుభవించినను సుఖమే కలుగవలె. కాని ఆ వస్తువును గూర్చి యొక్కొక్కనికిఁ గల యిష్టము బట్టి సుఖము కలుగు చున్నది. ఈ యిష్టమేమిటి ? "ఆనంద మనఁగా ఏ నా తెలియనంతవఱకు నేను అనుభ వించను" అని నిశ్చయించుకొని అనుభవమును ఆప వచ్చును. మనము పెట్టుకొన్న లక్ష్యమును సాధించుటకుఁ దగిన సాధనము లభించువఱకు దానిని గూర్చి ప్రయత్నించుచుండినచో అదే తపస్సు అగును. ధ్రువుఁడు సమ్రాట్ పదవిని కోరు కొనినాఁడు. అది లభించు వఱకు అతఁడు సుఖములనే మానుకొని తపించినాఁడు. తాను అనుకొన్న దానిని సాధించిన తరువాతనే అతఁడు మామూలుగా సంసార సుఖ ములను అంగీకరించినాఁడు. దీక్ష యన్నచో అట్లుండ వలె.

మన యనుభవమును గూర్చి కూడ ఇట్లే విచారింప వలె. అనుభవించుట ఒక మనోవృత్తి. కాబట్టి ఆనందము కూడ ఒక మనోవృత్తియే. అనఁగా నీ మనస్సు ఆనందమును తికి వచ్చిన దన్నమాట. అప్పుడు నీవు ఆనందమును అనుభవించువాఁడ వగుచున్నావు. అద్దములో నీ ముఖము యొక్క ప్రతి బింబమును చూచుకొని నిన్నే చూచుకొను చున్నట్లు నీకు ఆనందము కలిగినది. ఇది తెలియక ఆనందించుటయే నీ వగు చున్నావు. ఈ ఆనందించుట లేక పోయినచో నేను లేనని యనుకొని దానికొఱకు అంగలార్చు చున్నావు. అద్దములో ప్రతి బింబమును చూచు కొను నప్పుడు ఆ ప్రతిబింబమే నీవనుకొని అద్దమును వదలకుండ పట్టుకొనుట యెట్టిదో, ఆనందించుటయే నీ వనుకొని మనస్సును వదలకుండుట అట్టిదే. మన కున్న యుపాధులన్నియు మన యద్దములు. ఈ అందఱిలోనున్న నన్ను నేను చూచు కొనుచున్నాను. ఉపాధులనఁగా మన భార్యాపుత్రాదు లన్నమాట. "నేను" అనువాఁడను ఒకఁడ నున్నాఁడ నని తెలియక మనకున్న యుపాధులను చూచుచున్నాము. భార్యా పుత్రాదులు బాగున్నచో మనము బాగున్నట్లు, వారు బాగుండక పోయినచో మనము బాగు లేనట్లు భావించుచు, వారి వలన కలుగు నానందము నిత్యమనుకొని, అది పోయి నపుడు మరల దాని కొఱకు ప్రయత్నించుచు గల్లంతు పడుచున్నాము, ఆనందమును అనుభవించువాఁడను నేనే కదా, నేనున్నాను గదా, ఇఁక భార్యా పుత్రాదులు లేక పోయినచో నేమి, నేనెందులకు ఆనందము పొందఁ గూడదు, అని ఆలోచింపము. నా ప్రతి బింబమును తెచ్చు నుపాధులు లేకపోయినను "నేను" ఉన్నానని తెలియుటకే మృత్యువు మొదలగు వానిని గూర్చి విచారింప వలసి యున్నది.

## VII మోక్షము

### 1) జన్మరాహిత్యము

కొందఱు వేదాంత దృష్టి కలిగినవారు మాటిమాటికి మనకు జన్మరాహిత్యము కావలె అని చెప్పుచుందురు. జన్మరాహిత్యమెవరికి కావలె ? జన్మ ఎత్తినవానికే గాని జన్మకుఁగాదు. "ఈ జన్మయే నేను" అని యనుకొన్నచో ఇంక రాహిత్యమెవరికి ? నేను అనఁగా పుట్టినవాఁడను, పెరుగుచున్నవాఁడను, తుదకు చచ్చువాఁడను అనియే మనము వ్యవహరించుచున్నాము. ఈ మానవ వ్యక్తిత్వము (Human personality) చచ్చిన తరువాత నుండునా ? ఉండదా ? దీనిని గూర్చి పరిశోధించిన మనస్తత్త్వ శాస్త్ర పరిశోధక సంఘమువారు (Psychic Research Society) ఈ మానవ వ్యక్తిత్వము చచ్చిన తరువాతకూడ కొనసాగుచుండుననియే (Continue) చెప్పుచున్నారు. మనము చేసికొన్న కర్మ ఫలముల వలన ఏదో జన్మ ఎత్తుదుమని శాస్త్రము చెప్పుచున్నది. మనకు ఆ శాస్త్రవిషయము తెలియుట ఎట్లు ? "నే నెవఁడను" అని విచారించుకొనుచు పోయిన యెడల మనయాశలే మన స్వరూపమును ఒక విధముగా సూచించుచుండు నని తెలియఁ గలదు.

ఆశను గూర్చియే ఆలోచింపుఁడు. మనము ఎప్పుడును ఉండవలయునని, హాయిగా ఉండవలెనని, ఎప్పుడును అన్ని విషయములు తెలియవలయునని మనకు గాఢమైన యాశలున్నవి. ఇట్టి కోరికలు మనకున్నట్లే మనకు తెలియదు. వేద శాస్త్ర పురాణములలో సుకృత ఫలములుగా వర్ణింపఁబడిన ఐహికాముష్మిక భోగములన్నియు మన యాశల స్వరూపములే. కాని యిన్ని యాశలు మనకున్నవన్నచో అందఱును ఒప్పుకొనరు. అట్లు ఒప్పుకొనుటకు అభిమానము అడ్డు వచ్చును. మనలను గూర్చి మనకున్న యభిమానముల నన్నింటిని పరీక్షలోనికి తెచ్చిననే తప్ప విచారణ కొనసాగదు. ఒక్కొక్క సమయములో మనకు అన్నింటి మీఁద విరక్తి కలిగినట్లే యుండును. ఇది యొకరకమైన యభిమానము. ఈ యభిమానము నాది. ఈ యభిమానము నేను కాదు. మఱి "నేను" ఎవఁడను ? ఈ విచారణ కేవలము నన్నే ఆశ్రయించినది (Purely subjective) అని తెలిసికొనినఁ గాని ముందుకు సాగలేము. అభిమానమును పూర్తిగా వదలవలె. ఇది చాల కష్టము. అందువలననే ఈ విచారణను వదిలిపెట్టి వెలుపలి వస్తువుల విచారణ (Objective observation) చేయుటకు ప్రారంభింతుము.

ఒక రాయి తీసికొని ఇదేమిటి ? అని ప్రశ్న వేసినచో ఏదో ఒక విశేషమును గోరి ప్రశ్న వేయుదుము. అది రాతి ముక్క అని మన కిదివఱకే తెలియును. కాని ఆ తెలిసినదానితో తృప్తి కలుగ నప్పుడు ప్రశ్న వేయుదుము "నేను ఇట్లు ఎందుకు అడుగుచున్నాను" అను ప్రశ్నను ఏ శాస్త్రజ్ఞుఁడును (Scientist) వేయఁడు, శాస్త్ర విచారణ Scientific enquiry, అనఁగా విశ్వాసముతో (Faith) సంబంధము లేకుండ వట్టి పరిశీలన (Observation) ప్రయోగము (Experiment) అను వానివలన తేలినదానినే సిద్ధాంత మొనర్తుమని, అదియే సరియైన విచారణ అని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. కాని ఒక యభిప్రాయము (Hypothesis), ఒక సూత్రము (Theory) లేకుండ ఇది వఱకు ఏ శాస్త్ర పరిశోధనము (Scientific Investigation) జరుగ లేదు. ఇదివఱకు మనకు తెలిసిన సిద్ధాంతముల (Laws) వల్ల ఇట్లు ఉండును అని అనుకొనకుండ అభిప్రాయములు (Hypotheses) గాని, సూత్రములు (Theories) గాని యుండవు గదా ! రాయి గాని మఱియొకటిగాని "యిది యేమిటి" అన్నప్పుడు. దానిని ఉన్నవి ఉన్నట్లుగా చూచి తృప్తి లేకనే కదా ప్రశ్నించుట, సాధారణముగా రాయి యంటే అందఱకును తెలియును. విచారణ అక్కఱ లేదు. మఱి యీ ప్రశ్న యెందుకు ? ఆ రాయిలో ఏదైన విశేషమున్నచో మనకుపయోగ పడునేమో అని ఆశ. అట్లే క్రొత్త వస్తువేదైన కన్పించి నంతనే యిదేమిటని ప్రశ్నింతుము. "అదేమి చేయదు: భయములేదు" అని యెవరైన చెప్పినచో సరేయని సంతృప్తి పడుదుము. కాఁబట్టి మన ప్రశ్నలకన్నింటికి మన యాశయో, భయమో మూలమై యుండునన్నమాట.

ఆశకన్న భయమే బలవత్తరమైనది. మనకు ఇతరులతో కలిసి హాయిగా నుండుట ఇష్టమే. కాని మన హాయికి కారణమైన మిత్రుఁడో, ప్రియురాలో, సుఖముగా మనకు అప్తులు కారని తోఁచినచో వెంటనే భయముతో వారినుండి దూరమైపోయి ఒంటరిగా నుండుటకే యిష్టపడుదుము. మఱి యీ భయము పూర్తిగా ఎప్పటికి పోవును ? నీవు గాక వేఱొకటి రెండవది యున్నంత వఱకు ఈ భయము నిశ్శేషముగ పోనేపోదు. రెండవది యున్నదనఁగానే భయము అరంభ మగును. అందువలననే వేదము "రెండవదానివలననే భయము కలుగు చున్నది"(ద్వితీయాద్వై భయం భవతి) అని చెప్పుచున్నది. నీకంటే భిన్నముగా ఏదియున్నను భయమే; ది యొకటే; ఇదియంతయు నాకన్న భిన్నముగాదు" అని తెలిసినప్పుడే భయము ; అంతవఱకును పోదు,

"ఉన్నది ఒకటే" అన్న విషయము ఎట్లు తెలియును. విచారించిన తెలియును. ఇది పుస్తకము, ఇది పండు, ఇది రాయి, అని వ్యవహరించుచున్నాము. వీనిలో అన్నింటిలో సమానముగా ఉన్న "ఇది" ఏమిటి. పుస్తకము మారినను, పండు మారినను, రాయి మారినను, "ఇది" మారుట లేదు. ఇవి యన్నియు నీకు దృశ్యములు. నీవు ద్రష్టవు, అనగా చూచుచున్న వాఁడవు. ఎన్ని దృశ్యములు మారినను, చూచుచున్న నీవు మారుట లేదు. దృశ్యములలోని "ఇది" కూడ మారుట లేదు. దృశ్యమంతయును నీకు "ఇది" యే. ఈ దృశ్యమును ఒక్కొక్క పదార్థము యొక్క నామరూపములు పరిమితము (limited) చేయుచున్నవి. "ఇది పండు" అన్నప్పుడు, అంతవఱకు అపరిమితముగా ఉన్న "ఇది" అను దృశ్యమును, ఆ పండుయొక్క పేరు, ఆకారము కొంతవఱకు పరిమితము చేయుచున్నవి, కాఁబట్టి పదార్థములయొక్క నామరూపము లన్నియు విశేషణములే (Attributes) "ఇది" మాత్రమే విశేష్యము (Substantive) విశేషణము లెన్ని మారినను విశేష్యము మారదు. ఇట్లే చూచుచున్న నే "నెవరు" జీవులందఱు "నేను, నేను" అనుకొనుచునే చూచుచున్నారు. సకల పదార్థములలో "ఇది" అన్నది ఎట్లుఒకటిగానేయున్నదో అట్లే జీవులందఱిలో, ద్రష్టలలో, ఉన్న "నేను" అను స్ఫురణ కూడ ఒకటిగానే యున్నది. కనుక ఈ ద్రష్టలందఱిలో ఉన్నవాఁడను "నేనే". ఇంక నాచేత చూడఁబడుచున్న "ఇది" కూడ నాకన్న భిన్నముగా లేదు. ద్రష్టలేకపోయిన దృశ్యము లేదుకదా! ద్రష్టయొక్క ఒక మనోవృత్తియే దృశ్యము. ఈ వృత్తి లేనప్పుడు అనఁగా ద్రష్ట, దృశ్యము లేనప్పుడు, మిగిలియుండునది (Substratum) ఏది? అదియే చేతనమైన ఆత్మ. ఈ విధమైన విచారణ ఎందుకు చేయలేకున్నాము? మన లను గుఱించి మనకు "మనమనఁగా ఫలానావారము" అని గాఢమైన యభిమానముండుటే అభ్యంతరము. "నేను ఇట్టి వాఁడను, ఇంత వాఁడను" అని మొదలైన యభిమానముల నన్నింటిని వైరాగ్యమను నగ్నిలో పడవేసినఁగాని సరియైన విచారణ సాగదు.

## 2. దేవుఁడు

సకల పదార్థములను గూర్చి విచారించినట్లే దేవుని గూర్చి కూడ విచారింపవలసినదే. దేవునిగూర్చి మన యూహలు చాల చిత్రముగా నుండును. ఆ దేవుఁడు

శ్రీరాముఁడుగనో, శ్రీ కృష్ణుఁడుగనో కన్పించినప్పుడు, ఇతడు మనవలెనే ఉన్నాఁడు కాఁబట్టి దేవుఁడని యొప్పుకొనము. ఆయన కనఁబడనప్పుడు కనిపించుట లేదు కనుక లేఁడని యందుము. అనఁగా దేవుఁడు మనకు కనఁబడినను ఒప్పుకొనము, కనబడక పోయినను ఒప్పుకొనము. విచారణ చేసినచో దేవుని తత్త్వము కూడ తెలియునని శాస్త్రము చెప్పుచున్నది. వేదములలోని సంగతులు ముందు నమ్మకముతో వినవలె. తరువాత అనుభవములోనికి తెచ్చుకొన వచ్చును. అవి యనుభవములోనికి తప్పక రాఁగలవు.

మత గ్రంథములు పెక్కులున్నవి. అవి యన్నియు శ్రుతులు కావు. అవి వ్రాయఁబడిన గ్రంథము లని (Scriptures) ప్రసిద్ధములు. ఖురానులో చెప్పఁబడిన విషయములకు ఖురాను ప్రమాణము కావచ్చును. అట్లె బైబిలులో చెప్పఁబడిన విషయములకు బైబిలు ప్రమాణము కావచ్చును. అట్లె వేదశ్రుతి, అందులో చెప్పబడిన విషయములకు ప్రమాణము కాని వేదశ్రుతికిని, ఇతర మత గ్రంథములకును విషయము ఒకటి కాదు. అన్ని మతగ్రంథములు ఒక్కదానినే తెలియఁజేయుననుట పొసఁగదు. రాముఁడు, అల్లా, క్రీస్తు, ఒకటికాదు. బైబిలులో దేవుఁడు జీవులను (Souls) సృజించి నట్లున్నది. అట్లె అల్లా మనుష్యులను సృష్టించెనని చెప్పుదురు. మఱి మన దేవుఁడు మనలను సృష్టించ లేదు. ఏది ఏ విషయమును తెలుపఁగలదో దాని కది ప్రమాణము. రోగములకు మందులకు వైద్యశాస్త్రము ప్రమాణము. గృహనిర్మాణమునకు వాస్తు శాస్త్రము ప్రమాణము. రోగ నివారణమునకు వాస్తుశాస్త్రముగాని, గృహనిర్మాణమునకు వైద్యశాస్త్రము గాని ప్రమాణములుగావు. అట్లె బైబిలులో చెప్పఁబడిన "దేవునకు" (God) ఖురాను ప్రమాణము కాదు; ఖురానులో చెప్పఁబడిన "అల్లా"కు బైబిలు ప్రమాణము కాదు. ఇట్లె మన వేదములలో చెప్పబడిన దేవునకు ఏ యితర మతగ్రంథమును ప్రమాణము కాదు. కాఁబట్టి, అల్లా, జెహోవా, దేవుఁడు అను శబ్దములు ఒకవస్తువునే తెలియఁ జేయవు. మాటల యొక్క అర్థములను బట్టి వస్తువులయొక్క లక్షణములను సరిగా చూడక అల్లా, దేవుఁడు మొదలైన పదములన్నియు ఒక్కదానినే చెప్పుచున్నవను భ్రాంతిలో పడఁగూడదు. లోకములో నున్న మతములన్నియు ఒక్క దేవునే, ఒక్క మోక్షమునే చెప్పుటలేదు, దేవుఁడన్నను, మోక్షమన్నను ఎవరి యభిప్రాయము (conception) వారిదే,

మోక్షమునకు భక్తి ప్రధానమా, జ్ఞానము ప్రధానమా అను ప్రశ్నమునే ఉదా హరణముగా తీసికొనుడు. ఇక్కడ మోక్షమను మాటకు అర్థము తెలియదు. నికి సాధనము లని మనము భావించుచున్న భక్తిని గూర్చిగాని, జ్ఞానమును గూర్చి ని మనకు స్పష్టముగాతెలియునా? మఱి యీమాటలకు అర్థము స్పష్టముగా తెలియ చో ఆ ప్రశ్నకు సమాధానము నెట్లు తేల్చగలము ? ప్రతి మాట యొక్క నిర్వచ ము (Definition గ్రహించిననే తప్ప ఆ మాటయొక్క అర్థము మనకు బోధపడి ట్లు తృప్తి నొందరాదు. ఏ మాట విన్నను, వెంటనే ఏదో ఒక విధముగా అర్థము సికొనుమ వ్యవహార వేగములో పడిపోరాదు. ఎప్పుడైనను వేగపడుట అనర్థకము. ఏ పురుషుడు ఈ దేహమును విడుచుటకు ముందే కామక్రోధముల వలనఁ బుట్టు వేగమును సహింపఁ గల్గునో వాఁడే యోగి: వానికే సుఖము గలదు" అని శ్రీకృష్ణ భగవానుఁడు చెప్పినాఁడు,

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥

(భగవద్గీత - అధ్యా. 5 - శ్లో. 23)

కాఁబట్టి వేగపడక ప్రతి విషయమును విచారించి గ్రహించ వలె. ఆకలి వేయఁ గానే దొరకిన దంతయు తినరాదు. కోపము రాఁగానే కోపవృత్తిలో దిగరాదు. సంసారములో చిక్కులు లేని సందర్భము నందైన కొంచెము నిదానించి సంసార స్వభావమును పరీక్షింపవలె. ఆత్మ విచారణ చేయవలయునను తలంపు కలిగినను వెంటనే ఏదోవిధముగ మొదలు పెట్ట నక్కఱలేదు. సరియైన గురువు దొరికినప్పుడే విచారణ చేయవలె. ఆత్మ విచారణ ఎప్పుడైనను ఎవరైనను చేయవచ్చును. మనము నిత్యులము. తొందర యేమున్నది ? ఆకలి యైనంతనే వేగపడక శుచియైనది పుష్టి కరమైనది యైన యాహారమును సంతృప్తిగా భుజించునట్లే ఆత్మవిచారణ కూడ శాస్త్రము ననుసరించి సద్గురువు నొద్దనే చేయవలెను. ఒకఁడు ధర్మాచరణ పరాయ ణుఁడై ఏకారణము చేతనైన సద్గురువు నొద్ద ఈ యోగసిద్ధిని పొందలేక పోయి నచో: మధ్యలో మరణించినను, ఎప్పుడును దుర్గతిని పొందఁడు. "అట్టి యోగ భ్రష్టుఁడు అశ్వమేధాది పుణ్యముల నొనర్చిన వారి లోకములకు పోయి అచ్చట చిర కాలము దివ్యభోగముల ననుభవించి ఆచారవంతులగు శ్రీమంతుల యిండ్లలోఁ బుట్టును; లేదా ధీమంతులగు యోగుల వంశమునందే జన్మించును. శ్రీమంతుల యిండ్లలో

భగవద్గీతలో ఈ క్రింది శ్లోకము మొదలుకొని సమ్యగ్దర్శనమునకు సాధనములు చెప్పఁబడినవి. "ఆత్మ ప్రశంస లేకుండుట, స్వధర్మానుష్ఠానమును ప్రకటింపకుండుట, ప్రాణులకు పీడ కలిగింపకుండుట, ఇతరు లపరాధము చేసినపుడు ఉద్వేగము నొందకుండుట, వక్రిత లేకుండుట, ఆచార్యు నుపాసించుట, శరీరమును మనస్సును పరిశుద్ధముగ నుంచుకొనుట, మోక్షమును సంపాదింపవలయునను సంకల్పమున స్థిరత్వము, శరీరేంద్రియములు మంచి మా మునందే వర్తించునట్లు నియమించుట, ఐహికాముష్మిక భోగవిషయములందు అనురాగము లేకుండుట, అహంకారము లేకుండుట, పుట్టుక చావు ముసలితనము రోగము దుఃఖము అను వానియందు గర్భవాసాది దోషములను చూచుచుండుట........"

శ్లో॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥

శ్లో॥ ఇంద్రియా షు వైరాగ్య మనహంకార ఏవ చ ।
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషాను దర్శనమ్॥

(భగవద్గీత-అధ్యా. 13-.శ్లో 7, 8)

కాని శాస్త్రములో చెప్పఁబడిన జన్మాదివిషయములు మనకు అనుభవములో దుష్టములుగా దుఃఖ విషయములుగా కాక సుఖ విషయములుగానే యున్నవి. అవి నిజముగా మనకు దుష్టములుగా, దుఃఖ విషయములుగా తోఁచినచో ఈ సంసారమునందు, ఈ శరీరమునందు, ఇంత ఆసక్తి యెట్లుండును? ఈ క్రింది శ్లోకమును గమనింపుఁడు. ఇందు ఐహిక సుఖమునకు ప్రధాన కారణమైన భార్య దుఃఖమని చెప్పఁబడినది. "పుట్టుట దుఃఖము, ముసలితనము దుఃఖము, భార్య దుఃఖము; మాటిమాటికి ఈ సంసార సాగరమున పడుచుండుట దుఃఖము; కావున మెలఁకువ కలిగియుండుఁడు, మెలఁకువ కలిగియుండుఁడు."

శ్లో॥ జన్మ దుఃఖం జరాదుఃఖం జాయా దుఃఖం పునః పునః ।
సంసారసాగరం దుఃఖం తస్మా జ్జాగ్రత జాగ్రత॥

మనకు నిజముగా జన్మము, జాయ దుఃఖప్రదములుగా తోఁచిననే తప్ప వైరాగ్యము పుట్టదు; సరియైన విచారణ సాగదు.

## 4. శాంతి

వైరాగ్య మనఁగా నేమి ? రాగము లేకుండుట. మనకు రాగము వేనిమీద నున్నది ? మనవారనుకొను భార్యా పుత్రాదుల యందు, ధన కనక వస్తు వాహనము లందు, విషయములందు. వానియందు అనిత్యతాది దోషము లున్నవని అవి దుఃఖ కారణములని, అవాస్తవములని తెలిసినఁగాని వానియందలి రాగము పోదు.

ఇది మనస్సు యొక్క మోసము వ వచ్చినది. అత్యంతము అసమీచీనము లైన వానిని, మంచివి కానివానిని అది సమీ నములని మంచివని చెప్పి మనలను మోసగించును. మోహములో పడఁద్రోయును. అందువలననే శ్రీకృష్ణుఁడు ధర్మజు నకు తాను కౌరవులతో చేసిన యుద్ధము నిజమైన యుద్ధము కాదనియు, దుర్యోధనా దులు నిజమైన శత్రువులు కారనియు, మనస్సే తనకు శత్రువనియు, దానితో యు మే నిజమైన యుద్ధమనియు, ఈ యుద్ధములో జయము సాధించిననే తప్ప శాం రాదనియు, నిందు తన కితరు లెవ్వరును తోడ్పడరనియు, తా నొక్కఁడే పోరాడవలయుననియు చెప్పెను.

ఉ॥ అమ్మెయి బంధు మిత్రుల సహాయత కల్మి ప్రయోజనంబు లే
దమ్మహనీయ యుద్ధమున కాత్మయ తోడు మనంబు శత్రుఁడీ
వెమ్మెయినైన శాంతి ఘటియింపుము లోపగఁ దీర్పు మందు శాం
తమ్మ మమీ మనోవిజయితన్ వెలుఁగొందుము శాంత బుద్ధివై॥

గీ॥ అంతరం బగునిక్కయ్య మదిప గెలువ
కిట్ల యేగతిఁ బోయెదో యెఱుఁగ: దీని
నీవ కనికొని సద్బుద్ధి నిశ్చయ ప్ర
వీణుఁడవు గమ్ము మాటలు వేయునేల ? భా. 13-1-118,119.

ప్రతి క్షణమును ఈ మనస్సు మనలను మోహములోఁ బడఁద్రోయును. మనకుఁ బ్రేమాస్పదులైన భార్యా పుత్రాదులు, మనలను ధిఃకరించి ఎట్లు మనలను శాసింపఁ జూతురో, అట్లే యీ మనస్సును మనల శాసింపఁ జూచును. మనము దానిని మనకు బానిసఁ జేసికొన్నఁ గాని మనకు శాంతి లభింపదు.

అదొకప్పుడు శాంతముగా నున్నట్లుండి మనలను మోసము చేయును. కొంద ఱసలు దేనిని విచారింపరు. శాంతముగా నుందురు. అది నిజమైన శాంతి

కాదు. నీవు మనస్సునకు లోఁబడి యున్నావే కాని మనస్సు నీకు లోఁబడ లేదు. అది ఎప్పుడైన విజృంభించినచో నిన్ను ఎన్ని విధములనైన భంగపెట్టఁ గలదు. ఒక్క యుదాహరణము చూడుము. ఒక సభకు వెళ్లినపుడు చెప్పులు వాకిటియం దుంచి లోనికి పోవుదుము. తిరిగి పోవునప్పుడు ఎవరితోనో మాటాడుచు వాని సంగతియే మఱచిపోయి యింటికిఁ జేరుదుము. మనకు సహజము కాని వాటిని మనము మనస్సులో పెట్టుకొనము. చెప్పులు తొడుగు కొనలేదను విషయమే జ్ఞాపకము రాదు. చెప్పులు తొడుగుకొని నడచుట ఎన్నాళ్లుగా అలవాటుగా నున్నను, మఱచి పోయినప్పుడు చెప్పులు లేకపోయినను నడకలో లోపములేకుండ హాయిగానే ఇంటికి చేరుదుము. కాని యీ హాయి యెంతసేపు ? చెప్పుల సంగతి పకమురాఁగానే అది ఎగిరిపోవు చున్నది గదా ! మైమఱపు వలన కలిగిన యా యి, ప్రశాంతి ఎంత మోసమైనవో గ్రహింప వలె. ఇట్లే మానసిక విచారణలో ఎన్ని లోపము లున్నను చక్కఁగానే ఉన్నట్లు ఉండును. తప్పుడు సిద్ధాంతములు కొన్ని జన్మల వఱకు సాగవచ్చును. అవి తప్పులని కొన్ని జన్మలైన తరువాతఁగాని తెలియదు. కాఁబ మన మామూలు నిర్విచార స్థితి నిజమైన ప్రశాంతి కాదు. మనము మనస్సు నకు ఁబడక, దానిని మనము లోఁబఱచుకొన్నప్పుడే మనకు నిజమైన శాంతి కలు గును. కాఁబట్టి నిద్రించుచున్నట్లుగా మత్తుగా నున్న మనస్సును తట్టి లేపి (Provoking) దానిని పూర్తిగా విచారించవలె.

ఇట్లు చక్కఁగా విచారింపవలె నను బుద్ధి పుట్టుట మహాకష్టము. ఏదైన కర్మ, భక్తి యజ్ఞయాగాదులు చేయవలెనను బుద్ధి త్వరగాఁ బుట్టునుకాని విచారింపవలెనను బుద్ధి ఎన్ని జన్మల పూర్వపుణ్య మున్ననోకాని పు దు. విచారింపవలెనని తీవ్ర నిశ్చయముతో దత్తాత్రేయ మహర్షి ద ఱకు వచ్చి పరశురాముఁడు త్రిపురాదేవ్యు పాసనలోఁబడినాఁడు. పండ్రెండు ంవత్సరముల పిదప "ఇంత పిచ్చిలోఁ బడినా నేమి ? రత్నమును వదలి గాజుపూసను బట్టుకొన్నా"నని తిరిగి విచారణ కొఱకు గురువు దగ్గఱకు వచ్చినాఁడు. అప్పుడు దత్తాత్రేయులు నీ జాడ్యము వదలినదనియు ఆ పరాశక్తియే నీకీవిచారింపవలెనను బుద్ధిగా సాక్షాత్కరించినదనియుఁ జెప్పినాఁడు.

మనస్సు జడపదా ము. ఆత్మ యొక్కటియే చేతనము. జడముయొక్క గుణమే జాడ్యము. (INE TIA) కదలని స్థితిలో నున్నవస్తువు, అందే మాఱకుండ నుండుట, ఒక దిక్కుగా కదలుచున్న వస్తువు అదేదిక్కున మార్పులేకుండ సాగుట

జాడ్యము. మఱొక శక్తి దానిమీద పనిచేయనిది అందులో మార్పురాదు. (A body at rest will be at rest, till it is propelled by an external force. A body in motion will be in motion till it is stopped by an external force.) మనస్సుకూడ అదే విధముగా ఏమియు మార్పు లేకుండ నిశ్చలముగా నుండుట కూడ జాడ్యమే. కొందఱు ఏ విధమైన మార్పు లేకుండ, విచారింతమను బు లేకుండ మహాశ్ర గా కర్మానుష్ఠానము సాగింతురు. అది కూడ జాడ్యమని గ్రహించి విచారణకు రావలెను. మనస్సెప్పుడు ఏదో చేయవలెననియు చేయనిచో లాభము లేదనియు చెప్పును. ఆ స్థితి మాఱవలె. దీనిని మార్చుటకు శాస్త్రము అచార్యుఁడు సహాయము చేయుదురు. దాని కాతని పూర్వపుణ్యమును తోడు కావలెను. అతఁడు పట్టుదలతో, పూనికతో పౌరుషముతో నీ విచారణకు రావలెను. అత్యుత్తమమైన దానివలనఁ దప్ప హీనమైనదానివలనఁ దృప్తిపడనను మహాపౌరుషము కల్గిననేతప్ప అన్నిటి వదలి జీవుఁడీ విచారణకు రాఁడు. అతఁడే బ్రహ్మ విద్య కధికారి. అభావము ( దనుకొనుట-లేకపోవుట) వలన వచ్చిన విరాగము కలవాఁడు దీని కధికారి కాఁడు. లేదనుకొన్న వస్తువు దొరకిన తోడనే ఆతని వైరాగ్య మెగిరి పోవును.

మనము మంచివి అనుకొను నభిప్రాయములమీఁద మనకు రాగము, వానికి భిన్నముగా నితరులు చెప్పు అభిప్రాయముల మీఁద ద్వేషము కలుగు చున్నవి. శాస్త్రము తెలిసిన పెద్దలు మన యభిప్రాయములు తప్పని చెప్పుచున్నప్పుడు విని, మన యభిప్రాయములను రాగద్వేషములు లేకుండ నిష్పక్షపాతముగా విమర్శించుకొనుటయే ఆత్మ విమర్శ. (We must throw everything, all opinions including ours into the melting pot . మనకున్న రాగద్వేషములు చిత్రమైనవి. మనకేమియు తెలియకుండఁగనే ఒకఁడు ఇట్లుండుననుకొని, వానినిచూచి నపుడు "ఇట్లున్నాఁడేమి ?" యని తెల్లఁబోవుదుము. కావున మనస్సు యొక్క పోకడను కనిపెట్టి చూడవలెను. సత్యము మన మనుకొన్నట్లుండ వలెనని లేదు. దేవుఁడుండుట లేకపోవుట మన మనుకొన్నదానిమీఁద ఆధారపడి యుండదు. సూర్యుఁడు మనకు చాల చిన్న గోళముగాఁ గనఁబడును, అది సత్యమా ? ప్రమాతృత్వమును సంస్కరించుకొన్నఁగాని ఉన్నదున్నట్లుగా చూడలేము.

దుశ్చరితము నుండి విరమించుట మొదటి మెట్టు. పిదప స్వధర్మానుష్ఠానము. దానికి ధర్మమననేమో తెలియవలెను. నీకును ఇతరునకును సుఖమిచ్చునది ర్మము.

నీ కొక్కనికి సుఖముకొఱ కేమి చేసినను నీవు దుర్మార్గుఁడవే. అందు స్వధర్మము, పరధర్మము అననేమో తెలిసికొని, స్వధర్మానుష్ఠానము సకామముగాఁజేసి అత్యున్నత మైన పదమును పొంది అదికూడ అనిత్యమని గ్రహించి అప్పుడు నీవు నిష్కామ ముగా దైవప్రీతికొఱకే స్వధర్మ మనుష్ఠించి ఈ ఆత్మవిచారణకు అధికారివి కాగలవు.

అందఱు ఒకే స్థితిలో, సమాన స్థితిలో లేరు. వాని యధికారమును బట్టి వేదమాత వాని ధర్మము చెప్పినది. అదే స్వధర్మము. స్వధర్మాచరణము వలన ప్రతివాడును పై మెట్టుకు పోఁగలఁడు. స్వధర్మమును వదలి ప్రతి జీవియు హీన స్థితికి రాఁగలఁడు. పైవాఁడు క్రిందఁ బడఁడని, క్రిందివాఁడు పైకి పోఁడని లేదు. ఒక పుణ్యము వలన నిప్పుడు బ్రాహ్మణుఁడుగా జన్మించినను సహజమైన దుశ్చరి తము మానక హీనచారియై మరల హీన జన్మలు తెచ్చుకొనవచ్చును. ఉన్నతుఁడై నను ఒక చిన్న పొరపాటు వలన ఇప్పుడు హీనజన్మను పొందినను, పూర్వజన్మ యందలి సుకృతము వదలని కారణమున, వెనుకటి విచారణను సాగించి మోక్షము పొందవచ్చును. దానికి నిదర్శనము అతడు వేదప్రమాణము కల్గి స్వధర్మ నిష్ఠుఁడై యుండుటయే. వేద వాక్యములే చెప్పుచు, వేద విరుద్ధమైన ఆచారము కలవాఁడు ప్రజలను వంచించుచు అధః పతనము చెందును. కావున బ్రాహ్మణ జన్మ వచ్చినంత మాత్రమున లాభము లేదు. శూద్రజన్మ వచ్చినంత మాత్రమున నష్టమును లేదు.

ఇఁక మోక్షము దేనివలన వచ్చును? జ్ఞానము వలన - అనగా తెలిసికొనుట వలన. దేనిని? ఆత్మను అనఁగా తన్ను. తానెవరో తెలిసి కొన్న శోకమును దాటును. "తరతి శోక మాత్మవిత్". ఆత్మను తెలిసికొన్నవానికి తెలిసికొన్న క్షణమందే తాను సర్వబంధముల నుండి విడుపును పొందితి ననియు, శోక మోహా దులు, భయము, సర్వసందేహములు పోయినవనియు తెలియును. తనకు తెలిసిన దనుకొన్నవాఁడు తన కిట్టిది ప్రాప్తించినది లేనిది చూచుకొనవలెను. శాస్త్రము చెప్పిన మాటలు విని నమ్ముట విశ్వాసము. అది సరియైన విచారణ వలన జ్ఞానముగా మాఱవలెను. తాను నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావుఁడ నని తెలిసికొనవలెను.

తన్ను గుఱించి విచారించుటయే ఆత్మ విచారణ. దీనిని చెప్పునది ఆత్మ విద్య. ఇది అన్నిటికన్నను కష్టమైనది. ఎంతకష్టమైన దానినైనను "అదేమి ఆత్మ విద్యయా? అనుట వినుము. అనఁగా అన్నిటి కన్న ఆత్మ దుర్వి షయమైనది. ఆత్మను గుఱించి తాను వినవచ్చును, ఇతరులకుఁ జెప్పవచ్చును, తాను చూచితినని

చెప్పవచ్చును. తాను నమ్మవచ్చును గూడ. కాని ఆత్మ తెలియకుండక ఉండవచ్చును. ఇతఁడు జ్ఞాని యని జ్ఞాని కూడ చెప్పలేఁడు. అనఁగా గురువు కూడ తన శిష్యుఁడు జ్ఞాని యని గట్టిగా చెప్పలేఁడన్న మాట. ఇది స్వసంవేద్యమేకాని పరవేద్యము కాదు. ఇది తెలియుట అన్నిటికన్న ఆశ్చర్యమైనది.

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన । మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్య వచ్చైన మన్యః శృణోతి । శ్రుత్వాప్యేనం వేద నచైవకశ్చిత్॥
భ. గీ. 2-29

సరియైన విచారణ చేయవలెను తనకు సరిగా తెలిసినదా అనికూడ విచారింపవలెను. హనుమంతుఁడు లంకలో అశోక వనములో సీతవద్ద "రాజా దశరథోనామ...." అని ప్రారంభించి నప్పుడు తాను గొప్ప ఆపదలో నున్నను, తన కామాటలు అత్యంత ప్రియములైనను, సీతాదేవి వెంటనే నమ్మలేదు. "ఇది కలయా ? ఈ మాటలెట్లు వినుచున్నాను ? నాకు నిద్రలేదే. కల యెట్లు వచ్చును ?" అని ఆలోచించినది. అది రాక్షస మాయయేమోనని హనుమంతుని కూడ పరీక్షించినది. బుద్ధిమంతు డా విధముగా విచారించ వలెను.

వస్తువు యొక్క జ్ఞానము విచారణ వలననే. దీనికి సాధనము మరల మనస్సే. సంస్కరింపఁబడిన మనస్సే. సద్వ నిశ్చయ ప్రవీణుఁడు కావలెను. ఆది మరల విషయము కాదనియును, ఎప్పటికిని యము కాదనియును మఱవకూడదు. Every man says that God is beyond mind; but every fool wants to know God through the mind) ప్రతి మనుష్యుఁడు భగవంతుఁడు మనస్సునకు అగోచరుఁ డనియే చెప్పును. కాని ప్రతి మూర్ఖుఁడును మనస్సు చేతనే భగవంతుని తెలిసికొనఁ గోరును. ఆత్మ అనగా తాను మనస్సునకు పై వాఁడ నని తెలిసికొనవలెను.

ప్రతి మనుష్యుఁడు తానందఱికన్న గొప్పవాఁడు కావలెనని కోరును. కాని అజ్ఞానముతో, వంచనగా, అందఱు సమాన మనును. అన్నిటికన్న గొప్పది బ్రహ్మము. బ్రహ్మమును తెలిసికొన్న వాఁడు సర్వోత్కృష్టతను బొందును. "బ్రహ్మవిదాప్నోతి పరమ్." అనఁగా తాను బ్రహ్మము నని తెలిసికొనిననే తప్ప మోక్షము లేదు. అప్పుడే తాను నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావుడనని, సర్వోత్కృష్టుఁడనని

సచ్చిదానంద స్వరూపుఁడనని తెలిసికొని జీవన్ముక్తుఁడై మహాశాంతిని, మహదానంద మును పొందుట. శరీరపాతానంతరము విదేహముక్తిని పొంది బ్రహ్మముగా మిగులుట.

భయము మృత్యువు వలన. భయమన్ననే మృత్యువు వలని భయమన్నమాట. చచ్చుట అనునది క్రియ. "నేను చచ్చితిని" అనునది చచ్చిన నేను చెప్పలేను. మిగిలి చెప్పుచున్నాను గనుక. నేను చావని యెడల అసలు భయమే నాకుండఁగూడదు. కాని భయమున్నది. కాబట్టి నేను చచ్చుచున్న వాఁడనుగూడ కావలెను. అనుభవము లేనిది చెప్పుట కుదురదు. చెప్పిన నేను చావని నిత్యుఁడనైన నేను కావలెను. చచ్చు నేను, చావని నేను ఈ రెండు నేనులను గుర్తింప వలెను. విచారణ ఇట్లు "నేను" అని ఉత్తమ పురుషలో జరుగ వలెను. ఆత్మ అని, తాను అని ప్రథమ పురుషలో జరుగునది సరియైన విచారణ కాదు. తెలిసిన గురువు మాత్రమే శిష్యుని తరింపఁ జేయగలఁడు. అన్యుఁడుకాఁడు.

ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞాని నస్తత్వ దర్శినః

ఆత్మ ద్రష్టయైన ఆత్మజ్ఞానియే సరిగా శిష్యున కుపదేశింపఁ గలఁడు. సరియైన విచారణ చేయింపఁ గలఁడు. పుస్తకము లెన్ని చదివినను లాభము లేదు. వాని ప్రయోజనము తెలిసికొనవలెనని ప్రేరణ కల్గఁ జేయుటకును, తెలిసిన తరువాత మననమునకును.

సరిగా ఆత్మను, తన్ను తెలిసికొన్న చెదని శాంతి కల్గును. వైరాగ్యము, బోధ (జ్ఞానము) ఉపరతి ఇవి పరస్పర సహాయకారులు.

---o---

విమలానంద భారతీ గ్రంథమాల - త్రయోదశ పుష్పము

# ఉపదేశామృత తరంగిణి

( ద్వితీయ భాగము )



సంగ్రథనము

## పోలూరి హనుమజ్జానకీరామ శర్మ

వి జ య వా డ

పుట్టుటకన్న దరిద్రులగు యోగుల యిండ్లలోఁ బుట్టుటయే గొప్ప. ఇ జన్మ దొర కుట దుర్లభము కదా !"

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥

శ్లో॥ అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్॥ (భగవ త అ. 6 శ్లో 41,42)

కాఁబ తొందఱ పడక, ఈమృత్యువుతోనే మనము అంతమగుచున్నామని భ్రాంతి నొంక, నెమ్మదిగా ప్రతి విషయమును అర్థము చేసికొనుచు శాస్త్రములలో చెప్పిన యనుష్ఠానము చేసికొనుచుండిన, పైన చెప్పినట్లుగా, దివ్యభోగములను పొంది, ఉత్తమ జన్మము నొంది పూర్వవాసన చేత సద్గురువు నాశ్రయించి చక్కఁగా విచారణ చేసి కృతార్థులము కాఁగలము. అట్లు గాక పడుచుఁదనపుఁ జేష్టలచే చెడిపోఁగూడదు. పెద్దలు చెప్పినారు గదా !

కం॥ పరువంబు కలిమి దొరతన
మరయమి యనున వీనియం దొకఁ డొకఁడే
పొరయించు నన ఘ నాఁ
బరగినచో నాల్గు ప్పవలయునె చెపుమా॥ (నీతి చంద్రిక)

## 3. తన్ను తాను విమర్శించుకొనుట

తన్ను తాను విమర్శించుకొనుటయే మోక్షమునకు సాధనమని పెద్దలందురు. (స్వవిమర్శో మోక్షః - Self analysis is the means of release, మన్ము, నన్ను నేను విమర్శించుకొనుట యనఁగా నా యాలోచనలను కూడ విమర్శించవలెఁ గదా ! శాస్త్రాచార్యోపదేశము చేత మన యాలోచనలను గూడ మనమే విమర్శించు కోవలె. జ్ఞానము రాఁగానే అజ్ఞాన మను బంధనము పోవును. సంసారములో ఏ వ్యవహారమును చూచినను చిక్కుగానే (complex) కన్పించును. కావుననే విమర్శ (analysis) కావలె. అనుభవమువలన కలుగు జ్ఞానము, అనుభవమును సంపాదించు కొనుటకు కావలసిన జ్ఞానము, అని జ్ఞానము రెండు విధములుగా నున్నది. ఈ రెంటింటిని కలిపి మనము అనుభవజ్ఞానమని యనుకొనుచున్నాము. ఇదియే మన జ్ఞానము యొక్క చిక్కు పడు స్వభావము (complex nature). ఈ రెంటింటిని

విడఁదీయ వలయునని కాంట్ (Kant) చెప్పినాఁడు. కన్నులు తెఱవవలయు నను నొక సహజ జ్ఞానము (Innate) ఉన్నది. దానివలననే కనులుతెఱచి చూచుచున్నాము. "నాకు కన్ను లున్నవి. వానిని తెఱువ వలయును" అను జ్ఞానమెట్లు వచ్చినది? ఇవి యన్నియు తెలిసికొనుటే స్వవిమర్శనము. స్వవిమర్శనకు తనంతట తానే అధికారి యగునా? శాస్త్రాచార్యోపదేశము కావలెనా? శాస్త్రాచార్యోపదేశము లేక స్వ విమర్శనము సాగినే సాగదు. ప్రపంచము నంతను భావించి అందులో నీస్థానమేమో నీవు చూచుకొన్నచో ఒక విధమైన జ్ఞానము కలుగును. ప్రపంచమును గూర్చి నిన్ను గూర్చి యథార్థము తెలియు వఱకు సందేహించుచు ప్రశ్నించుచుండవలసినదే. సందేహమునకు ఆస్పదములుగానున్న యెన్నివిషయములు మాఱిపోయినను, నశించినను, సందేహించుచున్న నీవు మాత్రము మాఱవు, నశింపవు. (Doubt everything. The doubter will always exist)

అసలు వస్తువేమిటి అన్నచో విచారణ కావలె. "కర్మాచరణ మంతయు చిత్త శుద్ధికే పనికివచ్చునుగాని వస్తూపలబ్ధికి ఉపయోగింపదు. కోట్లకొలఁది కర్మానుష్ఠానములచేత కూడ కొంచెమైనను వస్తుస్వరూపము గోచరింపదు. వస్తుసిద్ధి విచారణ చేతనే కలుగును."

శ్లో॥ చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూప లబ్ధయే ।
వస్తు సిద్ధి ర్విచారేణ న కించిత్ కర్మకోటిభిః ॥ (వివేక చూడామణి ॥)

మనము విజ్ఞాతలము (Cognisers); ఇంద్రియములు విజ్ఞాన సాధనములు. శబ్దమును గ్రహించుటకు చెవి సాధనము. కాని వినువాఁడవు నీవే. మనకు చెవి యున్నంత మాత్రమున అన్నిమాటలు వినఁబడవు. మన కిష్టమైన మాటను శ్రద్ధతో విందుము; కష్టము కలిగించు మాటను విననే వినము. మనలో నున్న ప్రమాత (Cogniser) అనేక సంస్కారములతో నున్నాఁడు. ఆ సంస్కారములను బట్టి ఎవరి ప్రపంచమును వారు చూచుచున్నారు. ఒక విషయమునే నలుగురు చూచుచున్నచో ఒకరికున్న యభిప్రాయము మఱియొకరి కుండదు. ఒక వంటకమునే తినుచున్నప్పుడు ఒకఁడు ఉప్పు ఎక్కువైన దనఁగా, మఱియొకఁడు తక్కువైన దనును. కాఁబట్టి మనము ప్రతి విషయమును మన సంస్కారములలో నుండి చూతుము. ఇట్టి యెడల వస్తు తత్త్వమును యథార్థముగా చూడవలయు నన్నచో మన యంతరంగమును పరిశుద్ధమగునట్లు చేసికోవలె.

త్త్వము శూన్యముగా సాక్షాత్కరింపఁగా, మఱియొకనికి ద్వైతముగా, ఇంకొకనికి ద్వైతాద్వైతముగా, వేఱొకనికి అద్వైతముగా సాక్షాత్కరించుచున్నది. మఱి సాక్షాత్కారము ప్రమాణమైనచో ఈ భేదమెట్లు సంభవించును ? కావున శాస్త్రాచార్యోపదేశమును బట్టి ప్రమాత ప్రమాణముచేత ప్రమేయమును తెలిసికోవలె. నిలో ఏ దోషమున్నను సరియైన జ్ఞానము కలుగదు.

ఎంతో పుణ్యాత్ములైనవారుగాని పూనికతో విచారణకు దిగలేరు. భగవత్తత్త్వమును తెలిసి వలెనను గాఢమైన కోరికగలవాఁడు భక్తుఁడే. "ఓ అర్జునా! ఆపద నొందినవాఁడు భగవత్తత్త్వమును దెలిసికొనఁగోరినవాఁడు, సంపదలు కోరినవాఁడు, శాస్త్రజ్ఞానము నొంది ముముక్షువైనవాఁడు, అను నాలుగు విధములైనవారు పుణ్యాత్ములు నన్ను భజింతురు" అని శ్రీకృష్ణభగవానుఁడుచెప్పినాఁడు

శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినో౽ర్జున।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥

(భగవద్గీత - అధ్యా 7 - శ్లో. 16)

ఇట్లు కాక, కార్యసాధనలో భంగపడి దరిద్రులైనవారు భాగవతులగుదురు. "భగ్నాః కృశా భాగవతా భవన్తి" అన్న పద్ధతిలో, ఇదికూడ ఒకవిధమైన కాలక్షేపమగును లెమ్మని వేదాంతోపన్యాసములు వినఁబోవుచుట విచారణ కానేరదు. మనలో చాలమందికి ధనముగ సంపాదించి యనుభవించవలయునని యున్నది కాని ఆత్మ విచారణ చేయవలెనని లేదు. అట్లు ధనముగా సంపాదించి యనుభవించుటకు చేతఁగాక వేదాంతములోనికి దిగుచున్నాము. అసలు మన మనస్సులలో ఎంతెంత కోరికలు ఎన్ని ఉన్నవోకూడ మనకు తెలియదు. అవకాశము వచ్చినఁగాని అవి బయల్పడవు.

కోరిక లున్నప్పుడు వానిని ధర్మమార్గమున తీర్చుకొనుటకుప్రయత్నించుటయే మేలు. లేమివలన విరక్తిఁ జెంది (అభావే విరక్తః) ఈ జగత్తు అంతయు మిథ్య అని మెట్ట వేదాంతమునకు దిగినను, లేక దైన్యముతో ధనవంతుల నందఱను నిర్మూలించుటకు ప్రయత్నించినను అధోగతి పాలగుటయే సంభవించును. వేదములను చక్కఁగా పరిశీలించినచో, నీకు ఎంతెంత కోరికలు ఎన్ని యున్నవో, అ కోరికల నన్నింటికిని తీర్చుకొనుటకు మార్గము లుపదేశింప బడియున్నవి. ఇంద్ర పదవి గాని, బ్రహ్మపదవి గాని, విష్ణుత్వమే కాని నీవు ఏదికోరినచో అది తపస్సు చేత సంపాదింపఁ గలవు. ఈ శరీరముతోనే అన్నింటిని సాధించుట సాధ్యముకాదు.

చున్నాము. కాని నాలుగు ఆశ్రమములలో నేనియందైనను మనుష్యుడు జ్ఞానమును సంపాదింప వచ్చును. కాని ఆ జ్ఞానముతోపాటు సన్న్యాసము కూడ నుండిననే తప్ప మోక్షము రాదు. సన్న్యాసము కు ముఖ్య లక్షణము మానసికముగా సంసారమును వదలుట. కావున మానసికముగా సంసారమును వదలినవాఁడు గృహస్థుగా నున్నను జ్ఞానమును సంపాదించి మోక్షమును పొందవచ్చును. ప్రతి యుపనిషత్తు నందును చివర గురుపరంపరను చెప్పుదురు. ముండకోపనిషత్తులో తండ్రి ఆ విద్యను కుమారునకు చెప్పినట్లున్నది. ఇట్టిపట్ల శ్రీ శంకర భగవత్పాదుల వారొక న్యాయమును చెప్పినారు. "విరోధియైన యొకానొక హేతువు సిద్ధమైన న్యాయమును బాధింపదు." "లింగం స్థితం న్యాయం న బాధతే." సన్న్యసించినవాఁడే జ్ఞానియై ముక్తుఁడగునను లోకసిద్ధమైన న్యాయము. ఒకానొకఁడు గృహస్థుఁడుగ నేయుండి ముక్తి నొందెననుట పై న్యాయమును బాధింపదు. అట్టివాఁడు గృహస్థుఁడుగా నున్నను మానసికముగా సన్న్యసించెననియే మనము గ్రహింపవలసి యున్నది. సన్న్యాసియైనను గృహస్థుఁ అయినను మనస్సులో సన్న్యాసము లేకపోయిన మోక్షము రాదనుట సిద్ధాంతము. శ్రీ విద్యారణ్యస్వామి సన్న్యసించినతరువాత నవ సృష్టి కల్పించి, రాజ్యమును స్థాపించు ఆవశ్యకమైనప్పుడు అశ్వమునెక్కి యుద్ధము గూడ చేసినని చెప్పఁబడి యున్నది. కాని సన్న్యాసికి అట్టి వ్యవహారము తగదనుట ప్రసిద్ధము. మఱి విద్యారణ్యస్వామి సాధారణ సన్న్యాసి కాడు. ఆయన అధికారిక పురుషుఁడు. ఆయన వేదములకు భాష్యమును చెప్పుటకై ఆ వేద ధర్మరక్షణకై అవతరించిన మహాపురుషుఁడు. ఆయన ఆ విధముగా వ్యవహరించినను, నిత్యాత్మ దర్శనము కలవాఁ డగుటచే, ఆయనకు ఆ కర్మఫలము లంటవు. కావున ఆయన ఆ విధముగా చేయలేదని గాని, ఆయన చేసినాఁడు గనుక ప్రతి సన్న్యాసి అట్లు చేయవచ్చునని గాని తలంపరాదు. సాధారణ సన్న్యాసులు వ్యవహారమునకు దిగినచో భ్రష్టులగుట సులభము. తీవ్రముగా ప్రజ్వలించుచున్న యగ్నిలో పచ్చి కట్టెలు వేసినను, అవి భస్మమగునే కాని అగ్ని చల్లారదు. అట్లే ప్రగాఢమైన వైరాగ్యముతో ఆత్మ దర్శనము కలిగిన వానికి కర్మలు, కర్మఫలములు అంటవు. సామాన్యమైన నిప్పులో వేసిన పచ్చి కట్టెలు, ఆ నిప్పును చల్లార్చు నట్లుగా, సాధారణ సన్న్యాసులకు లోకవ్యవహారము లేర్పడినచో అది వారికున్న జ్ఞానమును పోగొట్టి సంసారులను జేయును. కావున మన యభిప్రాయములను ఎప్పటికప్పుడు నిశితముగా పరీక్షించుకొను చుండవలె.

## 17) శాస్త్రాచార్యోపదేశము

శాస్త్రాచార్యోపదేశము లేక తత్త్వము బోధపడదని శంకరులవారు అనేక పర్యాయములు చెప్పినారు. అరటి పండును ఒలిచి చేతిలో పెట్టినట్లు వారు ఎంతో సులభముగా వేదాంతార్థములను వివరించుచున్నను మాటిమాటి శాస్త్రాచార్యోపదేశ మునఁ గాని తత్త్వము తెలియదని జ్ఞాపకము చేయుచునే యున్నారు. శాస్త్రములో సకల విషయములు వివరముగనే యున్నను, వానిని మనము అర్థము చేసికొని అనుభవములోనికి తెచ్చుకొనుటకు ఆచార్యుని వలన తెలిసికొనుట [illegible] తీర్చుకొనుట అవశ్యకము.

మనకు ఎక్కడ సుఖమున్నదో అక్కడ మన కందఱకు విశ్వాస [illegible]. భార్య, పుత్రుఁడు మొదలైనవారు మనకు సుఖమును కలిగింతురని [illegible] ముగా విశ్వసింతుము. [illegible]రివలన హాయిగా ఉన్నామని, ఇఁకముందు [illegible] విశ్వాస మున్నది. ఇది జ్ఞానము కాదు; దృఢమైన [illegible]. [illegible] వచ్చి చాలమంది చచ్చిపోయినారు; అట్లే మరల ఉప్పెన [illegible] చచ్చిపోవచ్చును" అన్నచో అట్టి మాటలయందు మాత్రము విశ్వా[illegible]. [illegible] నను ఈ శరీరముతో ఎంతకాలమైనను బ్రతికి యుండవలయునను [illegible] లకు కారణము. ఈ శరీరము యొక్క నాశమును గూర్చి చెప్పినట్టి [illegible] మును మనము విశ్వసించుటకు ఇష్టపడము. కావున విశ్వాస [illegible] ర్థము కాదు. అందఱకును అనుభవములో నున్నదే. ఈ విశ్వా[illegible] రోజు జరిగినట్లే రేపు, ఎల్లుండి, ఎల్లప్పుడు జరుగునని వ్యవహరించు [illegible]. ఇట్లు వ్యవహరించుచున్నామని కూడ మనకు తెలియదు. ఈ విశ్వాస[illegible] లైన వస్తువుల మీఁదనుండి శాస్త్రములో చెప్పిన నిత్యములైన [illegible] మార్చవలె.

నిత్యము అను భావము (concept) మనకు ఎట్లు కలుగు [illegible] తెలిసిన శాశ్వతత్వము అను నభిప్రాయమును మనకు తెలిసిన [illegible] లకు జోడించి ఆలోచించు చుందుము. పోయినవారందఱు మనవలె [illegible] బ్రతికియున్నవారే. మనమును అట్లే యిప్పుడు బ్రతుకు చున్నాము. రేపు [illegible] మని యనుకొనము. అట్లు అనుకొన్నచో భార్యాపుత్రాదికమైన [illegible]

కొఱకు జరుగు యుద్ధమున పాపులను సంహరించుట హింస కాదు. మాంసాహారము మానలేనివారు వృథా పశుమారణము చేయకుండ దేవతా నివేదనముగా బలి గావించుట ఆవశ్యకము. దేవతా నివేదనము కావించినచో మనము అన్నము కొఱకుగా చేసిన జీవహింస వలన చేసిన పాపము నివర్తమగును. ఇందులకే వైశ్వదేవాది కర్మలు ఏర్పడి యున్నవి. దేవతకు నివేదింపఁబడని యన్నము పాపభూయిష్టము. వృథా పశుమారణము మహాపాపము.

ఒక ప్రాణిని చంపుటవలన ఆ ప్రాణికి ఉత్తమ స్థితి కలుగు చున్నట్లు నిదర్శన మేమున్నది? దేవతకు బలియైన పశువు లన్నియు మృతువు తరువాత తమకుఁగలిగిన యభ్యుదయ స్థితిని మనకు చెప్ప లేవు. కలలో ఒక జీవితము ననుభవించి మేల్కొన్నవాఁడు ఇప్పుడు జాగ్రదవస్థలో తనకు కలుగుచున్న యనుభవమును కలలో కన్పించిన వ్యక్తులతో చెప్పలేఁడు. మృతువు నిద్రవంటిదే; దీర్ఘనిద్ర. కావున ఆ నిద్రనుండి మఱియొక దశలోకి, అనఁగా జన్మాంతరములోనికో లోకాంతరములోనికో అడుగుపెట్టిన వాఁడు, కలవలె గడచిపోయిన పూర్వ జీవితములోని వ్యక్తులతో వెనుకటివలె వ్యవహరింపలేఁడు. కాని వ్యవహరింపఁగలిగిన వారును కొందఱు లేకపోలేదు. కబంధుఁడు శాపవశమున మహిమలను గోల్పోయి రాక్షసుఁడైనాఁడు. శ్రీ రామలక్ష్మణులు అతని బాహువులను ఖండింపఁగా అతఁడు పూర్వ స్మృతిపొంది, వారిని రామలక్ష్మణులనుగా గుర్తించి, ఈ కబంధ శరీరమును విధ్యుక్తముగా దహించి నేగాని నాకు వెనుకటి ప్రజ్ఞయు మహిమయు రాదు. కావున నన్ను వెంటనే దహింపుఁడు. తరువాత మీకు కర్తవ్యము నుపదేశింతును అని పల్కెను. రామలక్ష్మణులట్లు వానిని దహింపఁగా, వానికి వెంటనే, విధుక్తమైన యగ్నిసంస్కార వశమున, దివ్యశరీరము ప్రజ్ఞావిశేషములు కలిగెను. అతఁడప్పుడు రామునకు సుగ్రీవునితో స్నేహము చేసికొనవలసినదిగా ఉపదేశించెను. కావున శాస్త్ర విహితమైన పద్ధతిలో మృత్యువు సంభవించినచో తప్పక ఆ ప్రాణికది అభ్యుదయ హేతువేయగును. అట్లు మృత్యువును కలిగించినవాఁడు హింసకుఁడు కాఁడు.

## 15. సంసారమును చేయుచున్నవాఁడెవఁడు ?

అసలు చచ్చుచున్నవాఁడెవఁడు ? చచ్చుట లేక చనిపోవుట అనునది యొక క్రియ. కర్త లేకుండ క్రియ యుండదు. "నేను చచ్చుచున్నాను" అన్నప్పుడు చచ్చుచుండుటకు కర్త "నేను" ప్రతి క్రియలో అది జరుగుటకు పూర్వము, జరుగు చున్నప్పుడు, జరిగిన తరువాత కర్త దానికి భిన్నముగా నిలచియే యుండును. కాని చచ్చుట అను క్రియను భావించు నప్పుడు మాత్రము ప్రతివాఁడు ఆ క్రియతో పాటు కర్త కూడ ముగిసినట్లుగా తలంచుచు బాధ పడుచుండును. బ్రతుకు చున్నప్పుడు కూడ శరీరము చేయుచున్న పనులన్నియు తాను చేయుచున్నట్లు భావించుచుండుటయే యిందులకు మూలము. బ్రతుకు చున్నప్పుడు మనము శరీరమును విడిగా చూచుట లేదు ; "శరీరమే నేను" అని యనుకొను చున్నాము. అందువలన శరీరము నశించు చున్న దన్నప్పుడు, దానితో పాటు మనము కూడ నశించు చున్నట్లుగా బాధపడు చున్నాము. నిత్యమైన వస్తువు ఏదియు లేదు ; ప్రతిది అనిత్యమని చెప్పుచునుందుము కాని ఏదైన వస్తువు పోయినప్పుడు బాధపడుచునే యున్నాము. శరీరమే పోవు నప్పుడు మిగుల దుఃఖించు చున్నాము. కూలిపోవుచున్న యింటిలోనుండి వెలుపలికి వచ్చినట్లే, జీర్ణమై కూలిపోవుచున్న శరీరమునుండి కూడ వెలుపలికి వచ్చుచున్నాము. బ్రతుకు చున్నప్పుడు ప్రతి పనికి సాక్షిగా మిగులుచున్న మనము, చచ్చునప్పుడు ఆ క్రియకు సాక్షిగా ఏల మిగిలి యుండము. జీవితములో ఎన్నో పనులను సాధించు చుండిన మహా శక్తి స్వరూపులమైన మనము శరీరము పడిపోయినంత మాత్రమున శూన్యమై పోవుదుమా ? ఇది ఎట్లు సంభవము ? లేనిది యుండుట కాని, ఉన్నది లేకుండుటగాని జరుగదు కదా ! "నాసతో విద్యతే భావో, నాభావో విద్యతే సతః" [భగవద్గీత-అధ్యా. 2—శ్లో. 16] అని కదా గీతాశాస్త్ర సిద్ధాంతము. నేఁటి ప్రకృతి శాస్త్రముల యందుకూడ (Natural sciences & Physical sciences) "పదార్థము గాని శక్తి గాని పుట్టింపఁ బడదు, నాశము నొందదు ; రూపాంతరమును మాత్రమే పొందును" (matter or energy is neither created nor destroyed, but becomes only transformed) అనియే కదా సిద్ధాంతీకరింపఁ బడియున్నది. కాఁబట్టి "నేను, నేను" అని సకల వ్యవహారములకు మూలమైన శక్తిగా యున్న మనము ఎప్పుడును నశింపము. అనఁగా ఈ శరీరము వచ్చుటకు పూర్వము, ఇది పోయిన తరువాతకూడ మనము ఉందుమన్నమాట.

ఇదియే సర్వ విచారణకు మూలము కాని బ్రహ్మ విద్వరిష్ఠుండైన యాజ్ఞవల్క్య మహర్షి కూడ జనకుని సభలో, "బ్రహ్మవేత్తలకు నమస్కారము- మేము గోవులము కోరుచున్నాము" అనిపలికి జనకుని గోవులను పరిగ్రహించినాండుగదా! "ఆయననే ఈ సంసారము ఇంత గట్టిగా పట్టికొని యున్నదే, ఇంక మనకెట్లు వదలును?" అని యొకా నొకండు అడుంగ వచ్చును. కాని మఱి తాను సంసారమును పట్టుకొని యున్నాండా, తన్ను సంసారము పట్టుకొని యున్నదా? సంసారము మనలను పట్టుకొని యుండుట లేదు. దానిని మనమే పట్టుకొని, అది మనలను పట్టుకొని యున్నదని అంగలార్చుచున్నాము. ఆటలాడునపుడు పిల్లలు స్తంభమును పట్టుకొని, "ఈ స్తంభము నన్ను వదలుటలేదు" అని కేకలు పెట్టినట్లున్నది మన సంగతి." ఈ సంసారము నాకు అక్కఱలేదు అని నీవు దృఢముగా అన్నచో మఱుక్షణమే అది మాయమగును. దేహమే నేను అన్న అజ్ఞానమువలన ఈ సంసార మంతయు ప్రభవించుచున్నది. ఈ దేహము నేను కాను, నేను సచ్చిదానంద స్వరూపుండను జ్ఞానమువలన ఈ సంసార మంతయు మాయమగుచున్నది. వివిధము ఐన సంకల్పమే ఈ సంసారమునకు కర్త; నేను కాదు. ఈ విధముగా విచారణ జరుగవలయును."

శ్లో॥ అజ్ఞాన ప్రభవం సర్వం, జ్ఞానేన ప్రవిలీయతే।
సంకల్పో వివిధః కర్తా విచార స్సోఽయ మీదృశః॥

జీవితములో కలుగు చుండు దశల నన్నిటిని అనుభవించుచు వానిని వదలి జననమును మృత్యువును చూచుచు, అవి దేహమునకే కాని మనకు కావని, మనము నిత్యుల మని తెలిసికోవలెను. ఇట్లు తెలిసికొన్న తరువాత అర్జునునివలె ధర్మానుగతమైన సంసారమును చేయవచ్చును; శత్రువులతో యుద్ధము చేసి రాజ్యములు సంపాదింపవచ్చును. దేశమును కాపాడుకొనవచ్చును; సుఖమును పొందవచ్చును.

## సంకల్పము

మనకు బుద్ధులు పుట్టుచున్నవి ఎట్లు పుట్టుచున్నవి? ఎవరు ప్రేరేపించుచున్నారు? మన సంకల్పమువలన దుఃఖము కలిగినప్పుడే ఈ ప్రశ్న బయలుదేరును; సుఖము కలుగునప్పుడు బయలుదేరదు. మనకు జయము కలిగినప్పుడు ఎంతో చక్కగా ఆలోచించి చేసితి మని సగర్వముగ చెప్పుకొందుము. ఓడిపోయి నప్పుడు ప్రారబ్ధమువల్ల దుర్దైవమువల్ల అట్టి సంభవము కలిగినదని దుఃఖింతుము. అసలు ఏ బుద్ధియైనను ఎట్లు పుట్టుచున్నది? ఈ బుద్ధులు పుట్టుచున్న దెవరికి? అని ప్రశ్నించుకొని ఆలోచించవలె. మనస్సుయొక్క వృత్తియే బుద్ధి లేక సంకల్పము. అది "నా"కు కలుగుచున్నది. అనగా ఆ బుద్ధిగాని, సంకల్పముగాని "నేను" కాదు. ఈ సంకల్పములు కలుగుటకు మూలమేది? దానిని నేనుగాని సంకల్పమే పుట్టకుండ చేసినచో, అనగా మనస్సులో వృత్తులే పుట్టకున్నచో, నిద్రలోవలె "నేను" హాయిగా నుండగలను గదా మరి ఈ సంకల్పములను పుట్టకుండ చేయుటకు మార్గమేది? శాస్త్రము చెప్పినట్లుగా ధర్మకార్యములు చేయుచు మంచివృత్తులే కలుగునట్లుగా చేసికొన్నచో క్రమముగా మనస్సునకు సత్త్వము వృద్ధి నొందును, ఆ వృత్తులు పుట్టుచునప్పుడే చూడగలిగిన శక్తి కలుగును, అట్లు వృత్తులను స్పష్టముగా పుట్టుచున్నప్పుడే చూచుటకు మొదలు పెట్టినచో అవి క్రమముగా క్షీణించి అసలు పుట్టనే పుట్టవు. అప్పుడు నిద్రలోవలె జాగ్రదవస్థలో హాయిగానే యుందుము.

---

## మంచి - చెడు - హింస

అసలు వృత్తులే పుట్టకుండునట్లుగా చేసికొనుట సులభముకాదు. దానికి సాధనముగా మంచి సంకల్పములను పెంపొందించుకొనుచు చెడుతలంపులను నిర్మూలించుకోవలె. మంచి అనగానేది? నాకు ఇతరులకును సుఖము నిచ్చునది. అట్లు నాకును ఇతరులకును దుఃఖము కలిగించునది చెడువృత్తి. నేను చేయుపనివలన నాకు మాత్రమే సుఖము కలిగినచో చాలదు. దానివలన ఇతరులకు దుఃఖము కలిగినట్లయిన, వారు

యును. ఐశ్వర్యములందు సంపదలయందు లోభముగాని మృత్యువును గూర్చి భయముగాని యుండరాదు. శుభము, అశుభము అను భావన కూడ విచారణకు ప్రతిబంధకమే. మృత్యువునుగూర్చి నిర్భయముగా గ్రహింపఁగలిగిననే తప్ప తత్త్వ విచారణలో ఎవఁడును ప్రవేశింప లేఁడు. చాల విరాగ ముండినఁగాని మృత్యువును చూడలేము. సిడిన యింట్లో ఆ మాట అనుటయే పెద్ద తప్పునుగా భావింతురు. కావున సంసారభావనతో నిండిన జనులు వసించు నిండ్లలో ఈ మాటలు చెప్పు కొనుట కష్టమే. అందువలననే పూర్వము అడవులలో ఆశ్రమములలో మఠములలో ఇట్టి విచారణ చేయుచుండెడివారు. అట్టి తావులకు పోవు టకు వీలులేనప్పుడు మనమున్న తావునే అరణ్యమునుగా భావించి గాఢ విరాగముతో విచారించవలె.

"మృత్యువు ప్రమాద" మని సనత్సుజాతుఁడు చెప్పినాఁడుకదా ప్రమాద మనఁగా పొరపాటు. తాను కాని దేహమును తన్నుగాతలంచి దాని వినాశము తన వినాశముగా తలంచుటయే పొరపాటు. మోహ మునకుకూడా ఈ పొరపాటే మూలము. మోహ మనఁగా కేవలము అజ్ఞానముకాదు. దేహము తాను కాదని తెలిసినను, మాటిమాటికి ఆ దేహమే తానయినట్లు వర్తించుటే మోహము. మనకు భయము కలిగినపుడు ఆభయమును చూడవలె. అట్లే రాగద్వేషములనుకూడ చూడవలె. మనము బతుకుచున్నాము కాని బ్రతుకును చూచుటలేదు. మృత్యువును చూడవలె, చూడఁగలము. మృత్యువును చూచువాఁడు లేపోయినచో మృత్యువును గూర్చి ఎవరికి మా మొట్లు తెలియును? పెద్దలిట్లు చెప్పినారు. ఏకారణముచేత ద్రష్టయైన జీవుఁడు అన్ని మార్పులను తెలిసికొనుచున్నాఁడో అందువలననే దశము లెన్ని నశించుచున్నను ఆ ద్రష్టమాత్రము నశింపఁడు. ఇది నిజము. ద్రష్టకు వినాశమే సంభవించుచో, అది యెవనిచే చూడఁబడును? కావున ద్రష్టకు నాశము లేదు. అతఁడు సకల దృశ్యభేదములను చూచువాఁడై స్వయముగా ప్రకాశించుచున్నాఁడు."

లోకమును చూచుచున్న యీ ద్రష్ట మృత్యువునకు కూడ ద్రష్టయే క్రిందటి జన్మలలో మృత్యువును అనుభవించితివి గనుకనే యిప్పుడు మృత్యు వనగా భయము కలుగుచున్నది. భయపడు చుండుట చచ్చుచుండుటే గానీ, "ఈ భయమేమి? చచ్చుట యేమి?" అని ప్రశ్నింప వలెనని తోఁచదు. పని పడినప్పుడు పరుగెత్తుచు రొప్పు చుండుటయే కాని ప్రాణాయామము చేయుట కిష్టపడము. తలవంచుకొని రామకోటి వ్రాయుట సులభమే కాని, "రామకోటి అనగా నేమి? ఈ వ్రాయుచున్న నే నెవఁడను?" అని ప్రశ్నించుకొనుట మాత్రము సులభము కాదు. అయినను దీక్షతో రామకోటి వ్రాయఁగా వ్రాయఁగా ఁగాని, "ఈ రామ కోటి యేమిటి? రాముఁ డనఁగా నెవఁడు? నే నెవఁడను? మా కిరువురకు నేమి సంబంధము" అను విచారణ ఆరంభము కాదు. నిజమునకు రామకోటి వ్రాయుటయే మనకు చరమలక్ష్యము కాదు. అది మనస్సునకు మంచి సంస్కారమును కలిగించుటకు ఒక సాధనము మాత్రమే.

"అసలీ సంసార మేమిటి? నే నెందుకీ సుఖదుఃఖముల ననుభవింపవలె?" అని ధైర్యముతో ఎందుకు ప్రశ్నింప లేక పోవు చున్నాము? ఎలాగో పుట్టినాము, ఏలాగో చచ్చి పోవుదుము అని మనకు దృఢమైనయభిప్రాయ మున్నది. కాకపోతే చచ్చిన తరువాత ఎక్కడనో ఏలోకములోనో చేరఁగల మని కూడ కొందఱము భావించుచున్నాము. అంతకు మించి, "ఈ చావేమిటి? మనము దేవుని పొందుటేమి? ఆదేవుఁడు ఈ చావు" నెందుకు కల్పించినాఁడు! అస లీదేవుఁ డెవరు! నే నెవరు! అన్న ప్రశ్నలను గూర్చి తలంపు కూడ లేకుండ ఎప్పటి కెట్లు తోఁచిన నట్లు ప్రవర్తించు చున్నాము. ఇది విచారణకు ప్రతి బంధక మైనజడత్వము. ఈ జాడ్యమును "బ్రహ్మ మును గూర్చి తెలిసికొనుటకు ఁబ్రయత్నింపుము" బ్రహ్మవిజిజ్ఞాసస్వ అను వాక ముయొక్క ప్రేరణబలముచేత (External force కొట్టి వేసి విచారణ ంకి దిగ వలె.

శ్రీకృష్ణభగవానుడు దుఃఖసంబంధము లేకుండుటయే యోగమని, దానిని ఈ క్రింది విధముగా వివరించి చెప్పినాడు. "యోగాభ్యాసవశమున చిత్తము నిరోధింపబడి, సమాధిచే పరిశుద్ధమైన యంతఃకరణము చేత చైతన్యస్వరూపమైన తన్ను చూచుచు సాధకుడు ఏస్థితియందు తనయందే సంతోషించుచుండునో; విషయములతో సంబంధము లేకుండ ఇంద్రియములతో అక్కఱ లేకుండ, బుద్ధిచేత మాత్రమే, అనగా అనుభవముచేత మాత్రమే, గ్రహింపదగిన యనంతమైనసుఖము ననుభవించుచు దానినుండి చలింపడో; దేనిని పొందినతరువాత అంతకు మించినలాభము మఱియొకటి యుండునని తలంపడో, దేనియందుండి ఎంతటి దుఃఖముచేత కూడ చలింపడో; దుఃఖసంబంధ రహితమైన యాస్థితిని యోగమని యెఱుంగుము. ఎప్పటికైన నిది తప్పక ఫలించునను నిశ్చయముతో, అప్పటికప్పుడే ఫలింపలేదే యనునిర్వేదము లేకుండ దృఢముగా అవలంబింపవలయును."

శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥
శ్లో॥ సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥
శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే॥
శ్లో॥ తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥

[భగవద్గీత—అధ్యా. 6 - శ్లో. 20, 21, 22, 23]

ఈ బ్రహ్మవిద్య సులభము కాదు. విషయములతో సంబంధము లేకుండ మనస్సును త్రిప్పివేసి నిశ్చలస్థితిలో నుండవలెను. గాఢవైరాగ్యము కలవానికి సులభమే; సామాన్యులకు కష్టమే. "ఈదేహము నాది కాదు" అని యొక్కమాట చెప్పుమన్న కష్టపడి దానిని కట్టించుకొన్నవాడు అనలేడు. అట్లే చావు లేకుండ నుండుట అందఱకును ఇష్టమే. అయినను, "నేను చావను; నాకు చావు లేదు" అని చెప్పుమన్న ప్రతి

నాఁడును వింతగా చూచును. కాని చచ్చుటకు మాత్ర మెవ్వఁడును ష్టపడఁడు. మనకు ఎప్పుడైనను ఎట్లైనను ఏశరీరముతో నైనను బ్రతికి యుండ లయు ననియే యుండును. ఒకనికి ఉరిశిక్ష పడినది. వైద ప్రయోగమునకు (Medical xp riment) శరీరములోనికి కుష్ఠువ్యాధి నెక్కించుకొనుటకు ఇష్టపడినచో ఉరిశిక్ష తప్పింతు ' అ కారు.. చెప్పఁగా అతఁడు అందులకు అంగీకరించెను. అనఁగా ఏవిధముగానైన ఉరి తప్పించుకొ ష్ఠవ్యాధితోనైన బతుకవలయు నని అతని యాకాంక్ష అన్నమాట. ంత శరీరాభిమానము గల జీవులకు బహ్మ విద సుల ` మెట్లగును? ఏవిద యైనను శ్రమ డి చిరకాలము అభ్య సిం కుండ భించుచున్నదా? విద్యా పరిపూర్ణతనుగూర్చి పూరు లిట్లు చెప్పి . "ఏవిద్య నైనను శాస్త్రను గా అధ యనము చేసినప్పు డొక పాదము, తరువాత గురువుల సన్నిధి ందు దానినిగూర్చి మన ము చేయుటవలన రెండవ పాదము. పిదప గ్రహించినదానిని ఉతా హ ముతో వ్యవహారమున సమన్వయించుచుండుట వలన మూ డవ పాదము, కాలము గడచుచున్నకొలఁది అనుభవమువలన నాల్గవ పాద మును లభించి పూర్ణ త నొందును."

శ్లో॥ కాలేన పాదం లభతే తథాయం
తథైవపాదం గురుయోగతశ ।
ఉతా హయోగేన చ పాదమ చ్చే
చ్ఛా_ౘిణ పాదం చ తతోఽభియాతి॥

కావున ఏదో కొంతకాలము శ్రవణమో మననమో చేసినంతమాత్ర మున వెంటనే మనకు అఖండమైన బహ్మానందము కలుగలేదని నిరి ణ్ణా లము కారాదు. తత్త్వ జ్ఞుఁడైన గురువు నాశ్రయించి పట్టుదలతో చా రణచేయుచు తత్త్వమును గ్రహింపవలె.

బ్రహ్మజ్ఞాని యెట్లుండును ఎట్టిగురువు నాశ్రయి ప లె ేక ములో ఇతరశాస్త్రముల విషయములో మిచేయుచున్నామో, ఈవిష యమున కూడ అట్లేచేయ లె. విదు ద్ధి ము వెలుఁగ పోయినచో, అవి యెందుకు వెలుఁగలే సి, మిచేసినచ వెలుఁగునని, ఆశాస్త్రములో

చక్షుస్సునకు తల్లి, సోదరి, భార్య మొదలైనవారందరును స్త్రీలే. వేదచక్షుస్సునకు తల్లి వేరు. సోదరి వేరు, భార్య వేరు. ఎవరి విషయములో ఎట్లువర్తింపుమని వేదము చెప్పుచున్నదో అట్లు వర్తించినచో ఆ ధర్మము నీకును ఎదుటివారికిని సుఖమును కలిగించును. ధర్మనిర్వహణమునకై ధర్మపద్ధతిలోనే డబ్బు సంపాదింపవలె. డబ్బు కావలసినచో ఈశ్వరునే ఆశ్రయింపవలెఁగాని సంపన్నులను, అధికారులను, అక్రమ మార్గములను అవలంబింపరాదు. డబ్బు వచ్చినకొలఁది యింకను రావలయుననియే యుండును, డబ్బుమీఁద కాంక్ష అధికమైనచో అది ఖర్చు అగుటకూడ ఇష్టముండదు. దానివలన రావలసిన సుఖభోగములనుకూడ వదులుకొని మొక్కొక్కఁడు దానినే కూడఁబెట్టుచుండును. దేవునిపై భక్తికూడ ఇట్లే పరిణమించును. మాటిమాటికి దేవునికి మ్రొక్కి ఏవేవో సుఖములు కోరికోరి అవియన్నియు అనిత్యములే యని తేలిన తరువాత, నిత్య సుఖస్వరూపుఁడైన దేవుఁడే కావలయునను కాంక్ష కలుగును.

## 5. తెలిసికొనుట

నిత్యసుఖమనఁగా నేమి ? మార్పులేని సుఖము నిత్యసుఖము. ప్రాపంచిక సుఖములెప్పుడును నిలుకడగా నుండవు. మారుచున్న ప్రపంచములో మారని వస్తువును తెలిసికొనుటయే జ్ఞానము. మారుచున్న ప్రపంచమును చూచునప్పుడు ఒక వృత్తి తరువాత మరియొక వృత్తి మనస్సులో పుట్టుచు పోవుచునున్నప్పుడు ఆ వృత్తులను గ్రహించుచున్న నేను మారుటలేదు. ఈ వృత్తులు తప్ప "నేను" అను పదార్థము వేరొకటి లేదని బౌద్ధులందురు. కాని ఒక వృత్తి పోయిన తరువాత మరియొకవృత్తి వచ్చుచున్నప్పుడు, వృత్తులే నా స్వరూప

మైనచో, ఆ వృత్తులతోపాటు నేనుగూడ పోవలసియుండునుగదా! అట్టియెడల పెక్కు వృత్తులను అనుస్యూతముగా ఎవడు గ్రహించి చెప్పుచున్నాడు?" అని శంకరులవారు ప్రశ్నించుచున్నారు, కావున మారుచున్న వృత్తులను చూచుచున్న "నేను" మారుటలేదు. నిద్ర లేచినవాఁడు "హాయిగా నిద్రపోయినాను, నాకేమియు తెలియలేదు". అని చెప్పుచున్నాఁడు. నిద్రకు పూర్తిని, నిద్రను గ్రహించినవాఁడు గదా యిట్లు చెప్పుచున్నాఁడు? కలు నిద్ర వాఁడు కాదు, మెలకువ కూడ వాఁడుకాదు, అవి వానిచేత గ్రహింపఁబడుచున్నవి. మెలఁకువ రాఁగానే దానిని చూడవలెఁగాని ఆ మెలఁకువతో తాదాత్మ్యమును పొందరాదు. నిద్రాంతమును జాగ్రదవసాంతమును చూడవలె. జాగ్ర దవ పోయి నిద్రవచ్చునప్పుడు గ్రహణశక్తి (WATCHFULNESS) పోవును; నిద్రపోయి మెలఁకువ వచ్చునప్పుడు గ్రహణశక్తి పైకి వచ్చును. దీనిని చక్కఁగా గమనింపవలె. నిద్రలో గ్రహణశక్తి పోయినను స్థూలశరీరము (PHYSICAL BODY) పోదు. మృత్యువులో గ్రహణశక్తితోపాటు స్థూలశరీరముకూడ పోవును. మృత్యువుకూడ చూడవలె. సుఖవృత్తులను చూచుట మొదలుపెట్టినచో, దుఃఖవృత్తు లనుగూడ చూడఁగలము; తుదకు మృత్యువునుగూడ చూడఁగలము.

మనకు జాగ్రదవసలో జ్ఞానమెట్లు కలుగుచున్నది? మన మొక కొబ్బరిచెట్టును చూచుచున్నామనుకొనుఁడు. ఒక్కొక్క క్షణము నందు మనచూపు చెట్టులోని యొకభాగమునే చూడఁగలదు కాని మొత్తము చెట్టును చూడలేదు. అన్నిభాగములను గ్రహించిన తరు వాత మనస్సు ఆ భాగముల నన్నింటిని ఒక సమన్వితరూపమున గ్రహించినప్పుడు మనకు అ కొబ్బరిచెట్టుయొక్క రూపము గోచరించు చున్నది. ఒక వస్తువును తెలిసికొనుట యనఁగా మనస్సు ఆ వస్తువు

ననే దుర్యోధనుడు మహారాజునకు కుమారుడుగ రాజ్యాకాంక్ష కల వాడుగా నిర్మించినాడు. ఆ పూర్వకర్మయొక్క లేదా ప్రారబ్ధము యొక్క ప్రభావము అంతవరకే. ఆ పైన రాజ్యాకాంక్షకు లోబడి పాండవులకు అన్యాయము చేయుటకుగాని, ఆ రాజ కాంక్షను ధిక్క రించి ధర్మమార్గమున వర్తించుటకుగాని, దుర్యోధనునకు స్వాతంత్ర మున్నది కావుననే తల్లి, తండ్రి, భీష్ముడు, విదురుడు, మొదలై వారందరు అతనికి ధర్మమును బోధించి సన్మార్గమునకు మరలింప యత్నించినారు. పూర్వజన్మలోని పాపకర్మల ఫలముగానే మనకు దుర్బుద్ధులు కలుగుచున్నవనుట నిజమే. కాని, మనోబలముచేత సంకల్పించి ఆ దుర్బుద్ధులను తొలగించుకొను స్వాతంత్ర్యము మన కున్నది. అందువలననే 'దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీతి కొరకు' (దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థమ్) అని వ్రతా నుష్ఠానములకు సంకల్పము చేయుచున్నాము. పురుషుడు ధర్మాధర్మ కార్యాచరణమునకు స్వతంత్రుడైన కర్తయన్నదే సకల శాస్త్రము లకు మూలము. చేయుటకు, చేయకుండుటకు, మరియొక విధముగా చేయుటకు సమర్థుడై యుండుటయే స్వతంత్రతకు లక్షణము. (కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థః స్వతంత్రః.) కావున నేను కర్తను, సర్వస్వతంత్రుడను. అని తెలిసికొనలేకపోవుట మహాపాపముయొక్క ఫలము.

మనము స్వతంత్రులమైన కర్తలమను సంగతి మనకు బాగా తెలియునదికాదు. జబ్బుచేసినప్పుడు; ఇదియొక ప్రారబ్ధము. అనుభ వింపక తప్పదు. అని చెప్పుచునే గ్రహశాంతులు, ఔషధసేవ జరుపు చునే యున్నాము. కాని యూరకుండుటలేదు. మనము అనుకొనకుండ మనకు సంభవించు సుఖము దుఃఖముకాని ప్రారబ్ధఫలమే. దానినే దైవమనికూడ అందురు. ఆ ప్రారబ్ధమును తప్పించుకొనుట ఎవనికిని సాధ్యముకాదు. రామునకు భార్యాపహరణము జరుగుట ప్రారబ్ధమే. దాని తప్పించుకొనుట ఆయనకు సాధ్యముకాదు. కాని అది సంభ వించిన తరువాత నిరాశా నిస్పృహలతో భార్యాన్వేషణము చేయక

దుర్గతినందుటకుఁగాని, దృఢసంకల్పముతో భారాన్వేషణము గావించి శత్రుసంహారమొనర్చి మరల భార్యను బొందుటకుఁగాని ఆయనకు స్వాతంత్ర్య మున్నది. కావున రాముడు స్వాతంత్ర్యము నవలంబించి ధర్మము ననుసరించి శత్రుసంహారమొనర్చి కృతార్థుడైనాడు. "ప్రబలమైన దేది ? ప్రారబ్ధమా, పౌరుషమా?" అన్నదే యోగవాసిష్ఠములో మొదటిప్రశ్న. "ఫలమిచ్చుటకు ప్రారంభించిన నీ పూర్వకర్మయే కదా ప్రారబ్ధము. ఆ కర్మను పూర్వజన్మలో చేసినవాఁడవు నీవే కదా! వెనుక పొరపాటు చేసినావు. గనుక ఇప్పుడు దిద్దుకో" అని రామునకు వసిష్ఠుఁడు ఉపదేశించినాడు. పూర్వజన్మదాక యెందులకు? ఈ జన్మయందే మనము దీనిని విమర్శింపవచ్చును. ఒకఁడు దొంగతనముచేసినాడు తత్ఫలితముగా చెరసాలలో పడినాడు. ఆ శిక్షను తప్పించుకొనుట సాధ్యముకాదు. దానిని అనుభవింపవలసినదే. కాని ఆ శిక్షపూర్తియైన తరువాత వాడు దొంగతనమును మానుకొని సద్వర్తనుఁడై అభ్యుదయము నొందవచ్చును గదా! కావున ప్రారబ్ధమును మనము తప్పక అనుభవింప వలసియేయున్నను, ఎప్పటికప్పుడు మనము చేయు సంకల్పములకు కార్యములకు మనము కర్తలమే అయినను వానివలన కలుగు ఫలములందు మనకు అధికారము లేదు. ఏ సంకల్పమునకు ఏ కార్యమునకు ఎంతఫలము ఎప్పుడీయవలయునో నిశ్చయించువాడు మాత్ర మీశ్వరుడే.

## మంచి జన్మలు

బుద్ధిలో స్వాతంత్ర్య ముండినఁ గాని ఆత్మవిచారణ సాగదు. జీవునకు మంచిపని చేయుటకుఁ గాని, చెడ్డపని చేయుటకుఁ గాని కర్తగా స్వాతంత్ర్య మున్నది; కాని ఆ పనులవలనఁ గలుగు ఫలములయెడ స్వాతంత్ర్యము లేదు; ఆ పనులననుసరించి దైవము ఏ ఫలముల నొసంగి, ఆ ఫలములను అనుభవింపక తప్పదు. జంతువులకు సంకల్పించు శక్తి లేదు గనుక అవి కర్తలుగావు. పూర్వజన్మలో

అందువలన పెక్కు సందర్భములలో వారి ప్రసంగములందు సందేహ
ములకు సమాధానములు లభింపవు ఒక యుదాహరణమును గమనిం
పుఁడు. ఒక పుట్టు గ్రుడ్డివానిని చూపి ఏసుక్రీస్తు యొక్క శిష్యులు
"ఈ గ్రుడ్డితనము అతని పాపము వలన కలిగినదా లేక అతని తల్లిదం
డ్రులు చేసిన పాపము వలన కలిగినదా!" అని ఏసుక్రీస్తును ప్రశ్నించిరి.
ఆయన: అది అతని పాపము కాదు; భగవంతుని మహిమ వెలుఁగొం
దుటకై ఇట్లు గావింప బడినది" అని సమాధానము చెప్పెనని చెప్పు
దురు.

Jesus answered, " Neither this man hath sinned, not his parents but that the works of God should be made manifest in him"

(St. John. Chop 9 No 3)

ఈ సమాధానమునకు ఏమి అర్థము? భగవంతుఁడు తన మహిమ
ప్రకాశించుటకై యొకనిని పుట్టు గ్రుడ్డినిగా చేయునా? యదార్థముగా
విచారింపఁ బూనిన వారు ఈ సమాధానమును అంగీకరింతురా

69 ఏ మతగ్రంథముల నైనను విచారణ దృష్టితోనే చదువు
చున్నామా? పుణ్యము కొఱకు పారాయణము చేయుట వేఱు తత్త్వ
మును గ్రహించుట వేఱు భగవద్గీతను చదువుచున్నవారిలో ఎం
మంది, "శాశ్వతము లైన కులధర్మములు" (కులధర్మాశ్చ శాశ
తాః) మొదలగు మాటలను గుర్తించు చున్నారు? ఆ మాటల
యథార్థముగ గ్రహించినచో కులధర్మము లీనాఁడు పనికి రావని
యెట్లు చెప్పుదురు.! ఒకనాఁటికి పనికిరాని ధర్మములు శాశ్వతములు
సనాతనములు ఎట్లగును? ఒకరి సంగతి యెందులకు? మన సంగతియే
విచారింతము. మనము గీతా శాస్త్రము యొక్క తాత్పర్యమును
గ్రహించుటకు కదా ఇక్కడకు చేరినాము. శంకరులవారు ఈ గీతా
శాస్త్రమునకు ప్రయోజన మేమని చెప్పిరో చూతుఁడు.

సంసారము పూర్తిగా పోవుటయను పరమమైన నిశ్శ్రేయసమే సంక్షేపముగా యీ గీతాశాస్త్రమునకు ప్రయోజనము

తస్యా గీతాశాస్త్రస్య ప్రయోజనం సంక్షేపతః పరం ।
నిశ్శ్రేయసం సంసారస్య అత్యంతో పరమలక్షణం ॥
గీతాభాష్య పీఠిక

మఱి మన మందఱమును యీ వాక్యము ప్రకారము మృత్యువును చూచి ఆత్మను తెలిసికొని యీ సంసారమును మానివేయుట ఫల మని తెలిసికొని కూడినామా ? "అనిత్యము, అసుఖము అయిన యీ లోకమును పొందిన నీవు నన్ను భజింపుము".

అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమామ్ ।
గీతా-అధ్యా-9-శ్లో ॥ 33

అను వాక్యమును స్మరించుచున్నామా ?

ఇట్టి దిక్కుమాలిన లోకములో పుట్టినవాఁడు ఈ లోకమును నమ్ముకొని యుండక తనను భజింపుమని కదా పరమేశ్వరుడు చెప్పినది

ఆకలి వేయఁగానే తినకపోయినచో చచ్చెద మనుకొను చున్నాము. అదికూడ విచారించవలె. ఆకలి యేమిటి ? వెనుక తిన్నవా రందఱు చచ్చినారు; ఇప్పుడు తినుచున్నవారు కూడా చచ్చుచునే యున్నారు. ఇంకతినినచో చావము యన్న యభిప్రాయ మున కర్థమేమి ? తినుచున్నచో చావకుండ నుండవచ్చునని మనకు ఆశ యున్నదన్నమాట ! ఆకలి యనునది లేకుండ, భోగము లనుభ వించుచు, వానిలో తినుటకూడ ఒక భోగమై యుండవలయు నని యున్నదా మనకు ? ఇట్లు వుండుటకు వీలయినచో మనకది యిష్టమే కదా ! కాని ఇది మఱి యెట్లు జరుగును ? శరీర మనఁగా ఆకలితో